# సాత్రాజితీయము

[ఐదంకముల నాటకము.]

శ్రీబుద్ధిమతీవిలాసము, ఉత్తరరాఘవీయము, సత్య
హరిశ్చంద్రీయము, మున్నగు నాటకముల
గ్రంథకర్తయగు

బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారిచే
రచియింపఁబడి

భాగవతుల సుబ్బయ్యగారిచేఁ
బ్రకటింపఁబడియె.

శ్రీవిద్యానిలయ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.

1920.

 PRICE 1-0-0

శ్రీ

# సాత్రాజితీయము.

ఐదంకముల నాటకము

బ్రహ్మశ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంత కవిచే

రచియింపఁబడి

బ్రహ్మశ్రీ భాగవతుల సుబ్బయ్యగారిచే

ప్రకటింపఁబడియె

విద్యానిలయముద్రాక్షరశాల

రాజమహేంద్రవరము

1914.



వెల 1-0-0

# ఈ నాటకమునందు వచ్చు పాత్రములు.

## పురుషులు.

| | |
|---|---|
| కృష్ణుడు | కథానాయకుడు |
| వసంతకుడు | కృష్ణుని వేడుక చెలికాడు |
| శతధన్వుడు | సత్యను గామించిన మఱియొకడు |
| శేవంతుడు | శతధన్వుని సేవకుడు |
| సత్రాజిత్తు | కథానాయిక తండ్రి |
| శంబరాసురుడు | శతధన్వుని హితుడు కంసమిత్రుడు |
| జాంబవంతుడు | భల్లూకపతి |
| వసుదేవుడు | కృష్ణుని తండ్రి |
| బలరాముడు | కృష్ణాగ్రజుడు |
| సాత్యకి | కృష్ణుని సోదరుడు |
| అక్రూరుడు | వసుదేవుని మంత్రి. |

## స్త్రీలు.

| | |
|---|---|
| సాత్రాజితి | కథానాయిక |
| రుక్మిణి | కృష్ణుని పట్టపుదేవి |
| కళావతి, మంజువాణి | సాత్రాజితి చెలికత్తెలు |
| మదనిక | రుక్మిణి చెలికత్తె |
| దేవకి | కృష్ణుని తల్లి |
| మాయాసత్య | శంబరుని 'సత్యా'వేషము |

శ్రీరస్తు.

# సాత్రాజితీయము

## ప్రథమాంకము.

### నాంది

ఎడపయినున్న దారమణి ♦ యెక్కడిదో మణి? నేరమేమియు
న్నవరకు నేరమేమి! రమ ♦ ణీ మణులన్నను గొల్లలేటికె
న్నదగి? వసుఁగొల్లలై రమ ♦ ణీ మణులిచ్చెడువారు మాకుఁటం
చెదపయి మామణిన్ మణిస ♦ హించెడు వెన్నుఁడు మిమ్ముఁ బ్రోవుతన్

[నాంద్యంతమున సూత్రధారుఁడు]

(హర్షమున సభనాలోకించి) ఆహా! భగవంతుండును బురాణపురుషుండును సంధ్యాకాల తాండవాడంబర కేళీవిలాసభాసురుండునగు మహానటునకుం బ్రథమపుత్రుండును బ్రమథగణంబులకెల్ల నధినాథుండును విఘ్నాధిపుఁడునగు గజవదనునకు జరుగు నీ మహోత్సవసమయమున సమకూడిన యీ పరిషజ్జనుల యుల్లాసంబెంతయుఁ గొనియాడఁదగియున్నది. వీరినింక సముచితనాటకప్రయోగంబున సంతసింపఁజేయవలయునని కా కడంగితి (తెరవంకఁజూచి) మారిషా! నీవు త్వరగా నిటు రమ్ము.

మారి— ఇదె వచ్చితి.

సూత్ర— మారిషా! పాత్రములన్నియు సిద్ధమైనవా?

మారి— మీయాజ్ఞ యన్యథా యెట్లు జరుగును? రంగమంతయు యథాయోగ్యముగ నలంకరింపఁబడియున్నది. చూడుఁడిప్పుడు,

చ॥ గణనకుమీఱు దీపకలి ♦ కల్కలి కల్, ఘనచిత్రనేత్రపా
రణ మొనరించు వన్నెలతె ♦ రల్ లలిరాకులతోడి పెందరుల్
రణదళిపాళి ఝూంకృతిగ ♦ రవ్యశ్రుతిధ్వని, వాద్యపుర్ ధణం
ధణ ధ్వజరావమై, యలరె ♦ నాటకరంగము నామనింబలెన్॥

కావునఁ బ్రయోగపారంభమునకై మేమందఱముత్సాహులమై యున్నారము.

సూత్ర— ఈయుత్సాహమునఁ బ్రయోగింప నెంచిన నాటక మేదియో మఱచెదవుసుమా

మారి— అంత యెడతెఱుంగని శిష్యమా! ఇప్పుడు లక్ష్మీకాంతకవివిరచితమైన సాత్రాజితీయమును గదా ప్రయోగింప నుద్దేశించితిమి. కవి యీనాటకము వ్రాయుటకుఁ గారణభూతుఁడైన విద్యాభిమానియు నుదారగుణభూషణుఁ డెవ్వరైనది నే నెఱుంగుదు వినుము,

ఉ॥ పాములపాటివంగడపు ♦ వార్ధికిఁ బున్నమచంద్రుఁడు, వి
ద్యామహనీయగేయకవి ♦ తావనితాభిమతాభిమాని, ల
క్ష్మీమహిళాకృపాశ్రయుఁడ ♦ శేషజనప్రథమానదాన వి
ద్యానతశాఖి, వొల్చు సుగు ♦ ణాంబుధి సుబ్బయనాయశస్వియై॥

చ॥ పరహితకారి యాతఁడు శు ♦ భంకరుఁడీ కవికాప్తుఁడై నిరం
తర తదభీష్టదాయి యయి ♦ నవ్యవిధానకథావిధాబుధా
దరముగ సత్య పెండిలికతన్ రచియింపఁగఁజేసి తాఁగృతీ
శ్వరత వహించి మించె సుయ ♦ శఃప్రసవంబులనించి దిక్కులన్॥

సూత్ర—మారిషా! నీయనుభావమును నీకృతీశ్వరుని భాషాభిమానమును నుదారగుణమును మెచ్చఁదగియున్నవి.

మారి—ఆర్యా! చూడుఁడు.

ఉ॥ ధారసుధారసస్రుతివి ♦ ధంబలరార నెఱాపడంతి సిం
గారపు లేఁతనవ్వవలెఁ ♦ గమ్మనిభావములూర ముత్తెపుం
గూరుపుఁబోసి తేనెలొలు ♦ కుంబలుకుంబడిఁగూర్చి కావ్యపు
న్నేరుపుఁజూపు ప్రౌఢకవి ♦ నిస్సహకార్పఁ దెవండభీష్టముల్

మారి—అట్లనకుఁడు అందఱట్టి రసగ్రహణపారీణులు పాత్రాపాత్రజ్ఞులుందురా? కేవల ధనలుబ్ధులయిన జ్ఞానశూన్యులు కవితాతత్త్వమెట్లానందింపఁగలరు? అభీష్టమెట్లు తీర్పఁగలరు. చేటికడ సంపాదిన నేమిప్రయోజనము?

సూత్ర—అవును అందులకే,

గీ॥ పరునియాచింపఁబోయెడి ♦ పక్షమందు
యాచకుఁడు దాతనైజంబు ♦ పరయవలయుఁ
బాత్రమెఱుఁగనిలుబ్ధుండు ♦ పరిభవించు
యాచకునిఁగాన యాచ్న ♦ దైన్యంబుదెచ్చు॥

(తెరలోపల) సాధు! భరతపుత్ర! సాధు! అనుభవసిద్ధమైననీయుక్తివాక్యము సర్వదా యంగీకారయోగ్యమై యున్నది.

సూత్ర—మారిషా; అల్లదే సత్రాజిత్తును శ్యమంతకమణికై యాచించి యతనిచే నిరాకరింపఁబడిన కృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు, వనమికఁబోవుదము రా.

(నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.

శ్రీరస్తు.

# సాత్రాజితీయము

ప్ర థ మాం క ము.

[పిమ్మట వసంతక ద్వితీయుండై కృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

కృ — సాధు భరతపుత్రా! సాధు! అనుభవలబ్ధమైన నీయీవాక్యము సర్వథా యంగీకారయోగ్యమై యున్నది. వయస్యా! వసంతకా! యాచన యెంత చెడ్డదోయీ, చూడు:

చ॥ నడకలు మందమౌ, మొగము ♦ న్ వికలత్వమొనంగు మాటలున్
దడబడు, కంఠమీ రెలుఁగ ♦ న్ జెడిపోవును, మానసంబు న్
దడజనియించుఁ, బాదము మొ ♦ దల్తలదాఁక వడంకు, నింతలోఁ
బడి చెయిసాచు యాచకున ♦ వస్థలకంటెను జావు మేలగున్॥

కావున

క॥ తనకున్ బరమేశ్వరుఁడి
చ్చినదానన్ దనిసి పెఱకుఁ ♦ జేసాపక యె
ట్టినరుండు గౌరవముఁగా
మను నాతనిమనికి భువన ♦ మాన్యము సుమిత్రా!॥

వసం — మిత్రమా! సత్రాజిత్తును మణి యడుగుటకుఁ దొలుత నీకీ వేదాంతములుఁ దోఁచ కుండినను గార్యాలోచనమునందు బృహస్పతినంతవాఁడనైన నాతో నేల మందలింపవైతివి?

కృ— వసంతకా! నేను స్వప్రయోజనపరుఁడనై యాశ్యమంతకమును నపేక్షింపలేదు కదా. యాదవరాజు దేశములోని యనావృష్టిమారీజాడ్యవ్యధల నపనయింపఁ దన్నడిగితిని. సత్రాజిత్తునకీమాత్రపుఁ బరోపకారబుద్ధి యుండవలదా! చూడు

గీ॥ ధనికుఁడై యున్నఁ బదుగురన్ ♦ మనుపవలయు
గాఁ దినని యర్థి కీని వి ♦ త్తంబదేల?
తనసుధారసధార సు ♦ ధాకరుండు
ఫూని ముక్కోటివేల్పులఁ ♦ బ్రోచుఁగాదె॥

వసం— లోభిని యాచించిన ఫలమిట్లే. పొదుగునిండఁ బాలుండియు నెగఁజేపు దగ్గరఁ జేరనీక వెనుకకుంబోయినఁదన్నుచు ముందుకువచ్చినఁ గొమ్ములతోఁ గుమ్ము బడి గేద పాలెవ్వరు పితుకఁగలరు? కాని నీవుకూడ నింతప్రయత్నము చేయఁదగినంతటి ప్రభావ మాశ్యమంతకమణియందేమున్నది?

కృష్ణు— వసంతకా; శ్యమంతకప్రభావమెన్నఁడు నీవువినలేదాయేమి? అలాగైన వినుము

సీ॥ కృష్ణపక్షవిభావ ♦ రీ వేళలందేని
వెలుఁగించుఁ బండువె ♦ న్నెలలపిండు
మకరాంక కేళికా ♦ మర్మ పాండిత్యంబుఁ
గలిగించుఁ గామినీ ♦ కాముకులకు
కోరునర్థములఁ జిం ♦ తారత్నమునుబోలి
గృహమేధికి నొసఁగు ♦ నహరహంబు
విశ్వంబునకు ననా ♦ వృష్టి మారీవ్యథా
జాడ్యరాహిత్యంబు ♦ సంతరించుఁ

గీ॥ బవలు రేలు ప్రవర్షించు ♦ భాసమాన
బద్మరాగచ్ఛటల్ నూరు ♦ బారువుల ప
సిండియు నిజప్రభాపూర ♦ హిండనాళి
దంతురదిగంతమైన శ్య ♦ మంతకంబు॥

వసం— ఇంతప్రభావముఁగలిగిన దీనిని సత్రాజిత్తు యెక్కడనుండి సంపాదించినాఁడు చెప్పుమా.

కృష్ణు— సూర్యు నారాధించి సంపాదించినాఁడట.

వసం—మిత్రమా! నీవును నీలాటి మణుల వేనవేలు సంపాదింపఁగలవాఁడవే. దానికై నీమనస్సునింక నాయాసపెట్టికొనకుము.

కృ—ఆయాసమేమియును లేదు. విశేషించి సంతోషముగా నేయున్నది.

వసం—ఎందుచేత?

కృ—అమ్మణి నమునుగుటనుంబోయి నేను జూడవలసినదానినిఁజూచుటచేత.

వసం—ఏమీ సత్రాజిత్తునకు మణితోఁగూడ కుమారీమణి గూడనున్నదా యేమి?

కృ—వసంతకా! నీయూహ యుక్తముగా నేయున్నది. నీకిది యెవ్వరైనఁ జెప్పిరా?

వసం—ఎవ్వరేల? నీముఖమే చెప్పుచున్నది.

కృ—ఏమని?

వసం—నేఁడు దేవియైన రుక్మిణి తప్పక కోపభవనమునుఁ బ్రవేశించుననని.

కృ—దుర్మార్గుఁడా! నీవుపోయి నిష్కారణముగా దేవికి నాపై ననుమానము గలిగించెదనుసుమీ!

వసం—పదారువేల గొల్లయిల్లాండ్రు నిరంతరము నిన్ను సేవించుచుండినను నస్ఖలిత బ్రహ్మచారివని లోకప్రఖ్యాతి వహించిననీపై దేవికెంద ఱెన్ని కొండెములు సెప్పిన నేమి ప్రయోజనము? కాని యాసత్రాజిత్కుమారీ మణి నీకెక్కడ నెట్లగపడినది?

కృ—వయస్యా! వినుము. నిన్నటిసాయంసమయమున మణికడుగుటకై సత్రాజిత్తునింటికేగి మరలివచ్చుచుండఁగా నందందు నైందవశిలాజాల సంఘటితంబులై సారసుధారసధవళితములగు కలధౌతభిత్తికలచే నొప్పారుచు నభ్రంకషవప్రభాగంబైన యాతని కేళీసౌధాగ్రంబునందలి చతుశ్శాలాప్రాంగణ ప్రదేశంబున బంధురసుగంధ ప్రసూనగంధసార సంబంధంబుచేఁ బుష్పంధయంబుల కొగిరమ్మని పెట్టుచున్న తనధమ్మిల్లబంధంబు గంధవాహంబును సార్థకంబుగఁ బ్రోదిసేయుచు బాహువల్లిపైనున్న యల్లకలుముల యిల్లాలిలీలఁ దెల్లదామరగద్దియపైఁ గొలువుదీర్చిన యల పలుకుల వెలందివలెను, వెండికొండ నెత్తంబుల విహరించు నలముంచుంగొండరాచూలి చెలువున స్వైరవిహార లాలసయగుచుండి బంగారపుటనంటిమోకలోని నడిమిలేతమవ్వయందలి వన్నియం బుక్కిలించి యుమియుచున్న తన మువ్వంపు టంగకంబులకాంతి తనరతనాల నగల జిగివెల్లువలతోడం గలిసి యాకసంబున కకాలంబుగ నింద్రచాపలాభంబు గలిగించుచుండినయొక్క

కాంతారత్నంబు వినయంబుతోడి విద్యరీతిఁ దననెయ్యంపుఁ గత్తియతోఁ గలిసి యేమేమో సంతనములాడుచున్నదాని, వెండియు

సీ॥ అజుని సృష్టికినెల్ల ♦ నవతంసకంబుగాఁ
దార్కాణ మొనరింపఁ ♦ దగినదానిఁ
ద్రిజగతీలావణ్య ♦ దీప్తిరాశియనంగ
నభిరామ విగ్రహ ♦ మైనదాని
అసమబాణుని పేరి ♦ యైంద్రజాలికు చేతి
మంత్రపింఛమనంగ ♦ మరియుదానిఁ
గవివాక్కులకుఁ జిత్ర ♦ కారుకుంచియ కేసి
వలఁతియై మించు చె ♦ ల్వంబుదాని
గీ॥ విమల శృంగారరస సము ♦ ద్రమునఁ బుట్టు
నగ్రిమాశిక్యమని చెప్ప ♦ నైనదానిఁ
జూడఁజూడ నాకౌతుక. వింత ♦ సోయగమున
పలరునిదు వాలుగంటిఁ గ ♦ న్నారగంటి॥

వసం — ఈమెయేనా సత్రాజిత్తుని కుమారి ?

కృ — మఱియుఁ గెవ్వరు?

వసం — తిరిగి యేదో నాకత్తిమీఁదికిఁ దేనిదెచ్చితివి. నేనేకర్మ మెఱుఁగకున్న నీలాటికార్యముల కన్నిఁటికి నీకు నేనే తోడ్పడుచున్నానని రుక్మిణి యెవ్వతెకే నాకొంపత్రవ్వుచున్నది. ఆమె యనుమానమునకుఁ దగినట్లా బాసిసకూఁతుర మదనిక యొజ్జతేలువలెఁ జాటుచాటున నాపై రుక్మిణితోఁ గొండెములు చెప్పుచుండును. ఇట్లుండఁగాఁ దిరిగి యిక్కాంత యెక్కడనుండియో నాప్రాణమునకై దాఁపరించినది. అయినను నీవుగూడ మెచ్చునట్టు కామె యెట్లుండునో చెప్పుము.

కృ — మిత్రమా ఆమె యిట్లుండునని పోల్చి యెట్లు చెప్పవచ్చు? చూడు,

గీ॥ తుల్యగుణ ధర్మవస్తుల ♦ తోడఁ బోల్చి
వర్ణ్యమిట్లుండునని చెప్ప ♦ వచ్చుఁగాని

పడఁతితోఁ బోల్ప సృష్టిప్రపంచమందు
సదృశమేదియు లేనిచో ♦ శక్యమగునె?॥

వసం— అవును. నేనీప్రపంచమంతయు వెదకుచున్నాను గాని నాభార్య కాయకంటె తోఁ బోల్పఁదగినవస్తువు నాకెచ్చటను నగపడినదికాదు. తెల్లగ నుండుటంబట్టియు నీరోడుట బట్టియుఁ బొరలుతీసిన నీరుల్లిగడ్డ సమానమగునేమోయని తలంచిన, నాభార్య కాయకంటియందున్న చపలస్వభావము దానియందు లేకుండుటచేత నుపమ సరిగాఁగుదిరినదికాదు. అట్లే సృష్టియందొక్కొకచోట నెక్కడను బోలికలులేని యాశ్చర్యపువస్తువులు గనఁబడుచుండును.

కృ— మిత్రమా! ఆకాంతామణిని సృష్టించిన యాసృష్టికర్తకే దాని సౌందర్యం బాశ్చర్యధుర్యమై యుండనోపునని నేనిట్లు దలంచెదను.

వసం— ఎట్లు?

కృ— మ॥ తననిర్మాణకళావిలాసమునకా ♦ త్మన్ మెచ్చుచున్ ధాత క
ల్కికి తెప్పార్పక చూచుటన్ మిగులదా ♦ కెన్ దృష్టిదోషంబు దా
న నెన్నన్నల్పఫలంబుపై చనియె స ♦ న్నంబయ్యె మధ్యంబు నం
తనపోఁకుండెఁ బడంతికిన్ గనుస ♦ మాంద్యంబున్ దటస్థించెఁగా॥

వసం— ఓహో! యిదనుక వికృతాంగియైన (గదా) యంగననా నీవు వర్ణించుచున్నది?

కృ— మూర్ఖుఁడా! నయనంబులయందలి చాంచల్యంబును, నడుమునందలి కార్శ్యంబును నడలయందలి మాంద్యంబును సుందరీమణులకు సహజాలంకారములుగదా!

వసం— ఆలాగైన లంకగుమ్మడికాయవలెనున్న యీలంబోదరము నాకు సహజాలంకారమేయైనది. కాని నావలెఁ బరమభాగ్యవంతుఁడైన యాబ్రహ్మ యీకాంత నింత చక్కఁగా నెట్లుసృష్టింపఁగలుగు? ఆమెను సృష్టించినది నీవంటి రసికశిఖామణి యెవ్వఁడో కానోపు

కృ— అదియేమోకాని,

మ॥ భువనానందకరున్ కళానిధిని నే ♦ పుణ్యుండు సృష్టించెనో
ప్రవరామోదవిలాసచూళికమలమే ♦ ధన్యుండు నిర్మించెనో
చివురుంబోణిముఖంబుఁ గూడ నతఁడే ♦ సృష్టించెనే కాని, యీ
నవలావణ్యసుధాప్తి లేశమయినన్ ♦ రాలేద యారెంటికిన్॥

వసం— మొత్తముమీఁద నీవుచెప్పినదంతయుఁ జాఁవలచిఁదింభఁ దాను నీఁగినది గంగ యను సామెతకు సరిపోవుచున్నది.

కృ— ఎందుచేత !

వసం— ఆకాంతామణిమీఁద ప్రేమచే నమృతనిధియైనచంద్రుని బొత్తుగాఁ దీసివేయుటచేత

కృ— స్పష్టముగాఁ దారతమ్యముకనుపడుచునేయున్నది; చూడు

గీ. కళలలో హెచ్చుతగ్గులు ♦ గానఁబడవు
మధ్యమున నల్లనగు పుట్టు ♦ మచ్చ లేదు
రాహువక్త్రప్రోషితాగ్నిచేఁ ♦ గ్రాఁగ లేదు
బోటినెమ్మోమునకు విధుఁ ♦ డేటిసాటి॥

వసం— ఓహో! నీవాచెలిం జూచినప్పటినుండి ప్రపంచమందలిసుందరవస్తువులనన్నిటి నిరసించుచున్నావు. ఇంక దేవియైన రుక్మిణి యామెదారి యామె చూచుకొనవలసినదేనా ?

కృ— మూఢుఁడా !

గీ॥ కన్నియం గ్రొత్తనొకదానిఁ ♦ గాంచినంత
పట్టపుం దేవి రుక్మిణిం ♦ బాయఁగలనె ?
పద్మినీసంగమము బొందఁ ♦ బడయుదునని
యినుఁడు ఛాయాసతిని విడు ♦ చునె? వయస్య! ॥

నేను దేవియెడ నట్టి యపరాధమును జేయఁగలనా?

వసం— అపరాధముకాక మరి యిదియేమిటి?

కృ— ఓయి ఛాందసుఁడా; లోకోత్తరసుందరవస్తువులు సర్వధా పరిగ్రహణయోగ్యములుగావా ?

వసం— తమవస్తువులఁ దాము లోకోత్తమములని తలంచుట యెక్కువతప్పగునదికాదు.

కృ— మిత్రమా ! నీవు నామాట నమ్మకున్నావు. మదనసామ్రాజ్యలక్ష్మియనఁదగిన యాలీలావతీ తనువిలాసంబు నేను నీకుఁ దృష్టిగా వర్ణింపలేకపోయినందులకుఁ జింతించుచున్నాను. చూడు

సీ॥ కలువరాయనికి వం♦కలుదిద్దు నిద్దంపుఁ
గళలనెమ్మోము చ♦క్కఁదనంబు

అరవిచ్చు మొగ్గలీ గ్రొ ♦ వ్విరులీ నలరారు
వలిపెంపు జిఱుత న ♦ వ్వుల బెడంగు
కలికిబిత్తఱి జింక ♦ చెలువు లుల్లసమాడు
తుల లేని బెళ్కుచూ ♦ పుల హొరంగు
పలచనై కాంచ ♦ న్నలఁజిమ్ము నెలమావి
చిగురాకు మోవి సో ♦ యగఁపు మెలవు

గీ. పదియునార్వన్నె బంగారు ♦ వన్నెకన్న
మిసమిసని మేనిపసిమియుఁ ♦ బసదలంప
నింతి కెంతెంత యందమెం ♦ దెందువలయు
నంత యందంబు తూఁచిన ♦ ట్లవతరించె.

వసం—మిత్రమా! నాకుం దెలియదుగాని ఎంతసరసముగా వర్ణింపవలయునో యంతస రసముగా వర్ణించితివి.

కృష్ణ—మరియొకటి చెప్పెద వినుము.

వసం—వినుచున్నాను.

కృ—మ. సరసస్మేరములై, సవిభ్రమములై, ♦ సాకూత రాగంబులై
విరళస్నిగ్ధములై విలాసకములై, ♦ వ్రీడాభిరామంబులై
తరళాలోలములౌ కటాక్షముల న ♦ త్తన్వంగి కైసేయు నే
పురుషుఁ డాతఁడె కృతార్థుఁ డాతఁడె జగ ♦ త్పూజ్యుండు ధన్యుండగున్

వసం—అట్లాగైన నీవాపాటి ధన్యుండవైతివా?

కృ—వసంతకా! నేనిదమిద్ధమని యెట్లు చెప్పఁగలను? ఈవిషయమున మధ్యవర్తియైన మన్మథుఁ డేప్రకారముగాఁ గార్యమును నిర్వహించునో?

వసం—వయస్యా! చింతింపకుము: అలోకమోహన సౌందర్యశాలివైన నీకు వనరూపవతి యైన యాకన్నియఁ గూర్పనిచో నామన్మథుని సమ్మోహన విద్యయంతయు నిష్ఫలముగా వృథయనియే నేదలఁచెద. ఇంతకు నక్కాంత నిన్నొక్కమాఱు చూడనైనఁ జూచినదా?

కృ— మిత్రమా ! చూడ కేమి ?

క. కలువలమై వెదఁజల్లిన
చెలువున, జాబిల్లి రేక ♦ చిక్కని తెలి వె
న్నెల రసముం జిలికినక్రియ
పొలఁతుక ననుఁ జూచె నిద్ద ♦ పుంజూపులతోఁ.

ఇండియు నాయంగన నన్నుఁ జూచినభంగిఁ దలంచుచు నాయంతరంగమూరక నాసలకుఁ దావిచ్చుచున్నది.

వసం— నీచిత్తమెప్పుడు వ్యర్థమైన యాశలను వహింపనుకాని యామె నిన్నెట్లు చూచినదో చెప్పుము.

కృ— సావధానముగా వినుము.

మ. తొలుతన్ సన్నను తెప్పలార్పక కనన్ ♦ దోడ్తోడ లేసిగ్గునన్
దలఁకొంచెంబుగవంచి నేలబాట వ్రే ♦ ల్డాటింపుచున్ బిక్కను
న్న లతాంగిన్ గనుమూటుజేసియరకం ♦ టన్ సానురాగంబుగాఁ
జెలిపైఁ మలపెన్ విలోలతరల ♦ స్నిగ్ధంబులౌ చూపులన్.

వసం— అట్లుగాక నిన్నుఁ జూచినతోడనే మేడమీఁదినుండిదిగివచ్చి నీతోడపైఁగూర్చుండు ననుకొంటివాయేమి? నీపై నాపైదలికి వలపంకురించినఁ గనుకనే నిన్నంత యొయ్యారముగాఁ జూచినది. నీవంటి కాముకులపాలిటి కట్టి క్రొంటి చూపులే మరుని దూపులు.

కృ— ఆవాలుగంటి క్రొఁగంటిచూపులతో మరుని తూపులెట్లు పనికివచ్చును ? చూడు

మ. మును బూఁదూపులఁదీయువిల్లుఁగొని యా ♦ ముక్కంటికన్మంటచే
తను భస్మంబయిపోయెఁగాని మరుఁడీ ♦ తన్వంగి భ్రూవల్లికా
ధనువందున్ జెలివాలుసోయగపు ని ♦ ద్దా చూపులన్ దూపులే
యనుసంధించి యదల్చినన్ గెలువఁడే ♦ యానాఁడె గౌరీపతిన్.

వసం— ఆమన్మథుఁడట్లు భస్మమైపోయినను విరహుల వేధింప మానలేదుకదా. ఎట్లయిన నేమి ?

కృ— ఎట్లుమానును ? ఆవిలాసవతి నన్నాలాగున నిజవిలోకన సుధారస ధారలచే ముంచివేసినప్పుడు నాస్థితియేలాగున నుండెననుకొంటివి ?

వసం—మితముతప్పి భోజనము చేసిన వానిస్థితివలె నుండెనా యేమి ?

కృ—కాదు నెచ్చెలీ ! వినుము.

మ. అనిమేషస్థితిగాంచెఁ గన్నుఁగవ; రా ♦ గానందభోగస్థితిన్
గనెఁజిత్తంబు, చెమర్చి దేహము నిదా ♦ ఘక్లాంతమై పుల్కరిం
చె ననుంగా ! యిఁక నేమనందు హరియిం ♦ చెన్ జిత్తమామత్తకా
శిని, వెన్వెంటనె తుంటవింటిదొర గ్రు ♦ చ్చెన్ మేనఁ బూఁబల్లెముల్.

వసం—ఓహో! నీవు చేయు దగ్ధపాటు భోజనమువలెనే నీకథ యెంతసేపటికిం గడముట్టకున్నది. ఇంత యారాటము గలవాఁడవు నిన్నా కామిని యంత యుత్యాగ్రముగాఁ జూచినప్పుడు వెంటనే యా వాలుగంటి మేడమీఁది కేగి యామెను నీ హృదయం బేల తెలియపఱుపక పోయితివి ?

కృ—మూర్ఖుఁడా ! ఈపాటి స్వల్ప పరిచయము చేతనే స్త్రీల మనంబు లారయ వచ్చునా ?

మ. అరకంటన్ గనుఁగొంట, పయ్యెదను సొ ♦ య్యారంబుగా దిద్దుకొం
ట రువారంబుగ నవ్వుచుంట, కొనపం ♦ టన్ మోవి సారించుటల్
సరసీజాక్షులకున్ స్వభావమగు చే ♦ ష్టల్ ; కాముకుల్ సంతసిం
తురు లోలోనవి యెల్ల స్వాత్మవిషయా ♦ వ్యక్తంబులం చెన్నుచున్

వసం—సంతసించుటె కాదు మీఁదుమిక్కిలి దెబ్బలుకూడఁ దినుచుందురు కాని యింతకు నాకాంత యభిప్రాయ మేదియో తెలిసికొనకయే వచ్చితివా ?

కృ—ఎట్లు తెలిసికొందును? ఆ వాలుగంటి నన్నాలాగునఁ జూచుచుండఁగా నెక్కడ నుండియో చుక్క తెగిపడ్డరీతి,

మ. అరజారుం దెలిచీరెకుచ్చెళులు పా ♦ దాబ్జంబులన్ జిందులా
డ, గ్రటన్నూపురమై, వలగ్నమసియా ♦ డన్ బైఁటజీరాడ, స
త్వరమై, యోమ్మనుమోముకొందు విగళ ♦ ద్ధమ్మిల్లబంధంబుతో
నరవిందానన యోర్తువచ్చెఁ దతమా ♦ ర్గాకూనశఖిన్నాంగియై.

ఇట్లువచ్చి యేదియో యాసాత్రిజితికిం జెప్పి,

ఆ. వె. తత్తరంబుతోడ ♦ నత్తన్వి తనకేలు
బాలకేలుతోడఁ ♦ గీలుకొల్పి

పడునయే మొనాఁగ ♦ వడివడిఁగొనిపోయె
సకియ నాదుప్రాణ ♦ సమితితోడ.

వసం—ఎక్కడెక్కడ? ఆ బానిసకూఁతురు తీసికొనిపోవునప్పుడా సాత్రాజితిని మాత్రమే కాక నీ ప్రాణములనేల కొనిపోయినదో దాని కొప్పువట్టి నీయొద్దకు లాగికొనివత్తును నన్నుబోనిమ్ము (పోఁబోవ)

కృ—మూఢుఁడా! అది నిజముగా నాప్రాణములను గాదు ప్రాణములవలెఁ బ్రేమాస్పదమైన యా కన్యారత్నమును మాత్రమే తీసికొనిపోయినది కాని నీవు శాంతింపుము.

వసం—శాంతించినాఁడను కాని ఈవిషయమై నీశరీరమును నిష్కారణముగా నాయాసపెట్టికొనకుము.

కృ—మిత్రమా! ఏమట్లు నిరుత్సాహము చేయుచున్నావు?

వసం—నిరుత్సాహము కాకేమున్నది కుడుములుఁగావు, ఉండ్రములుగావు

కృ—వయస్యా! నీకెప్పుడు భోజనభ్రాంతియే. ఇఁక విషయమును వినుము. అట్లు వచ్చిన మచ్చెకంటి తనకుం జెప్పిన యేదియో యొకవృత్తాంతమునంజేసి యాకన్నియ కించుక సంభ్రమపాటుచేఁ గలిగిన మనోవైకల్యమున నన్నుఁజూడ నవకాశ మెంతమాత్రము లేకున్నను, నెట్టకేలకు నవ్వాలుఁగంటి వెనువెంటఁజనుచుండి,

చం. మఱచితి నే పిఱుంద నెల ♦ మానికపుంజిగి యుంగరంబు నే
బిఱబిఱ నేగి తెత్తునని ♦ వెన్కకువచ్చి నిజాననంబుపైఁ
జిఱునగవింతెసంతగయి ♦ సేయఁగ ముద్దునన్నుఁ జూచె బి
త్తఱి నునుసిగ్గుతోఁ గలిసి ♦ తాఁగటలాడెడు నోరచూపులన్.

వసం—ఈమాట చెప్పవేమి. ఆ యొప్పులకుప్ప తన్ను తనంతతానే నీకొప్పగించికొన్నది. అదృష్టము లన్నియు నీకట్లు కలిసివచ్చుచున్నవి. కాని బొమ్మబిద్దలు గొట్టుకొనుచు నంతలోందరగా నక్కడకువచ్చి యక్కన్నియను దీసికొనిపోవుటకా బానిసకూఁతురు కొంప యేమి మునిఁగిపోయినది?

కృ—నేనదే యచ్చట నుండు సేవకులనడుగఁగా వారిట్లు చెప్పిరి.

వసం—ఎట్లు?

కృ—నేనా సత్రాజిత్తును మణియడుగుటకు మూఁడుదినముల క్రిందటనే దానికంఠమున ధరించి వేటకేగిన తనతమ్ముని ప్రసేనుని నెవ్వండో వధించి మణి హరించెనను వార్త యప్పుడ సత్రాజిత్తునకుఁ దెలిసినది. అని

వసం—ఇప్పుడు నీవన్నింటికిం జెడితివి. మణియుఁ గన్యామణియు లేకపోగా విశే
షించి యమ్మణికై నీవే యా ప్రసేనుని జంపితివను దుష్కీర్తి పేరి యింద్రనీల
మణి నీపాలఁబడినది. ఇప్పుడు నీవును సత్రాజిత్తును తలపట్లు పట్టుకొనుఁడు.

(తెరలోపల) స్రగ్ధర॥

హితుఁడై సద్బాంధవుండై ♦ యపుడుమ కువఁ ♦ డెంత ద్రోహంబు జేసెన్
శతధన్వీ! వేఁట కేగన్ ♦ చనుమున మణికై ♦ శౌరి నా తోడు నార్పన్
కృతవర్మా! యింక నీ దుః ♦ ప్రకృతిఁ గని మనమా ♦ కృష్ణుఁ బోనీయరాదీ
బ్రతు కేలా? కాల్పనే? యీ ♦ పగ నెటులయినన్ ♦ బాపుకోలేక యున్నన్॥

కృష్ణ- (ఆలకించి) వసంతకా! నీవనినట్లా సత్రాజిత్తు నాపైకి యుద్ధంబునకే సన్నద్ధుండై
వచ్చుచున్నాఁడు.

వసం—నేను మీన మేషములఁ జక్కఁగా లెక్కపెట్టి చెప్పిన మాటయే యది కాని
నన్ను మాత్రము నాభార్య కొప్పగించిరమ్మా. పసుమదైన నాభార్య వైధవ్య
దుఃఖమనుభవింపలేదు.

కృష్ణ—భీరుఁడా! నేను నీదగ్గరనే యున్నానుకద.

వసం—అట్లయిన నీ వెనుకనుండియే నేను యుద్ధము చేసెదను.

[పిమ్మట శతధన్వయూ రేవఁతుఁడు సత్రాజిత్తు ప్రవేశింతురు]

శత—మామా! సత్రాజిన్మహీపాలా! యిక్కడఁజూడుము,

చం॥ బలిసిన గండుఁబిల్లివలె ♦ బాల్యమునుండియు గొల్లపల్లెలో
పలమెల మెల్ల వెన్నయును ♦ బాలును ముచ్చిలి, యాఁటితేటిత్రో
వలఁ దెలివాటుకాఁడగుచుఁ ♦ బాంధులసొత్తుఁ దోఁచుచుండు దొం
గలగురువైన కృష్ణుఁడన ♦ ఘా! యితఁడే, పగదీర్చుకొమ్మికన్॥

సత్రా—ఏఁడీ ఏఁడీ యాదురాత్ముఁడు?

రేవం—గర్భతురమైన యీ వృద్ధమర్కటముతోఁ గూడ నిక్కడనే యున్నాఁడు.

సత్రా—

శా॥ ఔరా! మాధవ! యింతలోనె యిటుల ♦ న్యాయంబుగా వింతువా?
క్రూరాత్మా! నిను నేమిజేసితిను నా ♦ కన్ బాపనుల్ వచ్చునే?
ఘోరంబైన మదీయ ఖడ్గమున నీ ♦ తుండంబు ఖండించి నా
వైరంబెల్లను దీర్చికొందు నిలురా ♦ పాపాత్మ! ధీరుండవై॥

వసం—

చం॥ గడగడ గాను మెల్ల వడఁకెన్, బెదవుల్ చలియింప, మోముపై
ముడుతలు వేయుచుండఁ గడుఁ గూర్మి బిగించుచున్, బోసినోటితో
వెడవెడ మాటలాడుచు చడిఁ బీరముతోఁ, జరణద్వయంబు త్రో
క్కుడుపడు నిన్ను నీ ముసలికోపముఁ జూచిన నవ్వవచ్చెడిన్॥

సత్రా—ఏమీ! నాది ముసలికోపమా? ముసలికోపమో నెుసలికోపమో నీవచూచెదవు కాక.

కృష్ణు—అయ్యో! యీ బ్రాహ్మణునితో నేమి తొందరపడకుము.

వసం—కృష్ణా! రానిమ్ము కంపతోఁ దగిల్చినట్లీతని నావలను నీడ్చికొనిపోవుటకు నేను నా కొంకికర్రతో నిక్కడ సిద్ధముగానే యున్నాను.

కృష్ణు—వసంతకా! నీ విప్పుడు తొందరపడకుము. మామా! నేను నీకుఁ జేసిన ద్రోహమేమున్నది?

శత—(తనలో) ఏమీ! ఈదుర్మార్గుఁడు సత్రాజిత్తును "మామా" యని పిలుచుచున్నాఁడు. వీనికిని సత్యభామయందనురాగము కలదు. దానికిని వీనియందే మనస్సు పారయున్నదని దాని చెలికత్తె కళావతి నాతోఁ జెప్పినది. ఈ కృష్ణునకు సత్రాజిత్తునకేలాగైన విరోధము పెట్టితినా సత్రాజిత్తు వీనికి తన కూఁతునిచ్చి వివాహము చేయఁడు. అప్పుడు నేనే యీ సత్రాజిత్తునకల్లుఁడనయ్యెదను (ప్రకాశముగా) మామా! చూచితివా! యేమియు నెఱుంగనివానివలె నీ కృష్ణుఁడెట్లు నటించుచున్నాఁడో! ఇంతమాత్రమున మనమాతని వదలివేయరాదు.

ఉ॥ పోలరివయ్య నీవు వెఱఁ బొందెదు, వీనికి దొంగకున్ బలెన్
మాటలయందమాయికతమాఁ నసమం శుభయంబు మొగామునన్
గాటపుఁజిచ్చపాటును, వికారపుఁజూపులు. తెచ్చికోలు నా
రాటము, హెచ్చుఁగావుఁ దరంబుగ వీఁడె హరించె నీమణిన్॥

వసం—ఓరీ! నిర్భాగ్యుఁడా! నీవు నామీఁద చెప్పచుండలేదుకదా.

శేవం—బావురుబిల్లివలె దొంగమాపులు చూచుచున్న నీవు కూడ నీ దొంగతనములలోఁ జేరియే యుండవచ్చును. నీవంటి చెడుగుబాపనయ్యలకు ధనాశయెక్కువ.

వసం—శేవంతుఁడా! నీ కొండముచ్చువేసాల చాలింపుము.

శేవం—చెడుగా! మొక్కజొన్న పేలగింజవలె నూరక పేలకుము.

శత— (కనుగీటుచు) నీవు తొందరపడకు నేను చక్కఁగా వీరివురకుం బుద్ధి చెప్పెదను. (ప్రకాశముగా సత్రాజిత్తుం జూచి) నీకింకను సందేహ మెందులకు ?

క॥ తనయుఁడిగిన మణి నీవి
కునికి మహాటవిని నీస ♦ హోదరువధియిం
చెను నిజమింతయు! నేతటి
పనికిం దెగెఁ జూడు వీఁడు ♦ బాంధవ్యములో॥

కృ— ఓరీ! శతధన్వీ! యేలరా నిష్కారణముగాఁ గృష్ణునంతవానితో విరోధము తెచ్చి పెట్టుకొనుచుంటివి. నీకాత్మవినాశకాలము సమీపించినదా యేమి ?

శత— నిజమాడితినని నీవు నాపై నలుగుచున్నావు. నీకు వినాశకాలము సమీపించినది కావుననే నిష్కారణముగా సాధుపీడ గావింప మొదలుపెట్టితివి. (సత్రాజిత్తుతో) మామా! నీవేమైన ననుకొమ్ము ఈ కృష్ణుఁడు నీ కెంతెంత ద్రోహము చేయుచున్నాఁడో నే నిప్పు డెఱింగించినచో నీవు విశ్వసింతువో లేదో? కాని,

శా॥ మోమోటం బడఁబోకు మీనిపని యుం ♦ బుద్ధులక్కెల్ల నమ్మి, వీఁ
డేమమ్మాటికి నీమణిన్ గొనిన వాఁ ♦ డీపాటికిన్ దీరకే
మోమోసంబులు వన్ను చుండెనఁట యి ♦ మ్ముం గూడ ఖండింపఁగా
మామా! యెంతకు లేఁడు మెట్టు మనుచున్ ♦ మన్నింతువే మోసుమీ॥

సత్రా— అల్లుఁడా! నన్నుగూడ జంపనెంచుచున్నాఁడుగా నేను వీనికిఁ జేసిన ద్రోహమేమున్నది ?

శత— నీవు బ్రదుకుటయే యతనికి నీవు ద్రోహము చేయుట.

సత్రా— అదెట్లు?

శత— ఎట్టులా? మరల నెప్పటికైనఁ దాగణించిన మణిని నీ వపహరింతువని నిన్నుగూడ మట్టుపెట్ట నాలోచించుచున్నాఁడు ఇప్పటికైనఁ దెలిసినదా?

సత్రా— ఓరీ దుర్మార్గుఁడా! ధూర్త గోపాలా? ఎంత దురాలోచనముఁ జేయుచుంటివిరా.

వసం— సత్రాజిత్తూ! పిచ్చివాఁడవై నన్నురకక అమనున్న యీ యల్లుని నీ వెక్కడనుండి సంపాదించి తెచ్చితివి. వీని విషము నీకు తలకెక్కినదా యెవ్వరేమి చేయఁజాలరు సుమీ!

శత— ఓయీ వసంతకా! పొట్టకూటికై నేర్చుకొన్న నీవంకరమాటలు చాలింపుము.

వసం— పొట్టకూటికేగాక సత్రాజిత్తుని బాగుచేయునవియా నీ మాటలు. పాపమీ ముసలివాఁడు నాలుగుదినములు ప్రపంచములో జీవించియుండుట నీ కిష్టము లేదు

సత్రా — ఛీ బ్రహ్మబంధుఁడా! ఈ గొల్లవానికిఁ దోడు దొంగవై యుండుటకు నీవు బాగుగా నుపకరించితివి. సిగ్గుమాలిన నీజన్మ మీభూమికి మిక్కిలి భారము సుమీ?

వసం — నేను నిన్న దేయనుచున్నాను. నీవూరక ననాలోచనముగా సివాలు వేయకుము. చూడు యీ కృష్ణుఁడు నిర్దోషియైనట్లు నేనొక ప్రబలసాక్ష్యము చూపించుచున్నాను.

సత్రా — ఏదీ చూపుము.

వసం — యిదిగో వినుము. ఓవృద్ధరాజా!

గీ॥ నిజము కల్లనెఱుంగక ♦ నింద మోపి
వాసుదేవుని దూఱుట ♦ దోషమనుచు
నూగులాడెడి నీచెవి ♦ పోగుజతయె
రెండు చెంపల వాయించు ♦ చుండె నిన్న॥

సత్రా — ఓరీ! కృష్ణా! జారచోరశిఖామణివైన నిన్ను బ్రాహ్మణుఁడనుసరించిన దీలాటి పిచ్చికూతలు కూయుటకా?

కృష్ణ — మామా! ఇందు నిజముగా నీవే పిచ్చివాఁడవైతివి. వినుము

గీ॥ వినువ కెవ్వరేని సెప్పిన ♦ వినుచు నదియె
నిజమనుచుఁ దామసించెదు ♦ నీచమతిని
కొండెకాఁడు ద్విరు పలువురు ♦ గూడి కీలు
బొమ్మవలెన టులాడింత్రు ♦ నమ్మకమున॥

మామా! దుర్మార్గుఁడగు నీ శతధన్వమాటలు పాటికిదెచ్చి నామాట గీటునఁబుచ్చి నీవింత యవిచారముగా మాటాడుచున్నావేమి?

సత్రా — గోపాలా! నేను విచారించియే మాటాడుచున్నాను.

శత — మామా! వీఁడు నామాటలు కల్లనియనుచున్నాఁడు కాని నీతమ్ముఁడేగిన యరణ్యమార్గమున నీకృష్ణుఁడేగుచుండఁగాఁ జూచిన ఈరేవంతుఁడిందులకుఁ బ్రబలసాక్షియై యున్నాఁడు (కన్నుగీటుచు) రేవంతుఁడా! నీవుకూడ ని సత్రాజిత్ప్రభువునకు నొకపుల్ల విఱిచివేయుము.

రేవం — సత్రాజిత్ప్రభూ! మీపాదములతోడు మీతమ్ము వెనువెంటనే ఈకృష్ణుఁడరణ్యమునకుఁ బరువెత్తుచుండఁగా నాకన్నులతో నేనుఁ జూచితి. అప్పుడీతనిచేత ధనుర్బాణములున్నవి.

సత్రా — నందనందనా! యిందునకు నీవేమనియెదవు?

కృష్ణ—మామా! శాంతచిత్తుఁడవై విషయమును విమర్శింపక వీరిట్లాడించిన నట్లాడు
చున్నాఁడవు, చూడుము.

సీ. శతధన్వ నేఁడునీ ♦ హితుఁడైనమాత్రాన
కడమవారందఱు ♦ గానివారె?
మణినిమ్మనడిగిన ♦ మాత్ర దానికినీవు
తమ్ము నేఁజంపుట ♦ తథ్యమయ్య
నేనీయననుచుఁ డేఁగు ♦ గాని కేఁగినమాత్ర
యీరట్టు నాయందె ♦ చేరునయ్య
ఈదారిదక్క నిం ♦ కేదారి మణినాకు
లభియింపదంచుఁ ద ♦ లంతువయ్య

గీ. నిజము కల్లనెఱింగెడి ♦ నేర్పువలదె?
చుట్టఱికమేని కానంత ♦ చూడవలదె?
చివరకుఁ బ్రమాణమును జేసి ♦ చెప్పుమన్న
నావచనమైన నిసుమంత ♦ నమ్మవలదె.

శత—మామా! యితఁడెంతనైన గారముగా మాట్లాడుచున్నాఁడో చూడుము. నీతమ్మునిఁ జంపు
నప్పుడెవరైన నున్నచో నంతపని చేయుదునా? చుట్టరికమైనఁ జూడవలయుననట.

సత్రా—శతధన్వా! వీని కపటవినయములు నేనెఱుంగనివి కావు. (కోపముతో కృష్ణునిఁ
జూచి) దురాత్మా! కప్ప యెలుంగు పామవైన నీవు నాకు బంధుఁడవు కావు.

శా. బంధుద్రోహివి నీవు, కానియెడ దు ♦ ర్వ్యాపార సంధానధౌ
రంధర్యంబున నాసహోదరు వధిం ♦ మ్రిందించి కైకొందువా?
బంధంబుల్ విడనాడి, బంధురతపో ♦ భ్యాసుండవై పద్మినీ
బంధున్ లోఁగొని నేగణించినమణిన్ ♦ బ్రఖ్యాత తేజోఘృణిన్.

కావఁగా నీప్రమాణవచనములు మేము నమ్మవలయునుగా? అప్రమాణముల
యం దారితేరిన నిన్నెవ్వరు విశ్వసింతురు. ఉగ్గుఁబాలనుండి గుం దొంగచేష్ట
ములతోఁ బెరిగిన నీవెరుగుల గొప్పనాస్వాంతవు చెప్పుము.

కృ—ఛీ మూర్ఖా! యేమి యెఱుఁగక నిర్భయముగా వదరుచున్నావు.

ఉ. మాటికి మాటికిన్ దురభి ♦ మానముతో శతధన్వమాటలన్
బాటికిఁ దెచ్చినావయి నె ♦ పంబిడి మాతెఱను, పెద్దవానితో

నేటికిదిట్టరిమ్మనుచు ♦ నే కాన కాదుకొలంది బల్ సివా
ల్మీటుచుఁ బైకివచ్చెదు శ ♦ మింపవు సుమ్మిఁక నిన్ను దుర్మతీ !

వసం—కృష్ణా! ఊరకొన్నకొలఁది నీవడఁగీనుగింకను బైకివచ్చుచున్నాఁడవు, నీవు కొంచెము దూరముగానుండుము. చచ్చినవానిం గొట్టుటకు యమదండమువంటి నాయీదండముతో నీతని చచ్చిన బురదకొయ్యంగొట్టినట్టు కొట్టెదను. ఏమి సత్రాజిత్తూ!

మ. మొనగానింబలె గొంతుసించుకొనెదీ ♦ మూర్ఖంబు మాచేతగా
దనియా, హుమ్మని పైకివచ్చెదవు మా ♦ కాపాటి ధైర్యంబు లే
దనియా, కన్నవ కెంపుజేసి మెడగొ ♦ య్యగ్గి తిప్పె కెత్తినం
తనె చేతుల్ త్రిగియున్న వారమె దురా ♦ త్మా! యేటికీబింకముల్.

మ. సరసంజేరుచు మావిరోధియెవఁడో ♦ చాడీలుబోధించినన్
దురహంకారముచే నొడల్మఱచి గం ♦ తుల్ వేయుదే మాపయిన్
అరయంగాఁ బనిలేదె కల్లయునిజం ♦ బాపాటి శాంతంబు లే
క, రసాభాసముగా మొఱంగి పయిగాఁ ♦ గొట్లాటకున్ వత్తువా ?

కృ—వసంతకా! నీవూరకుండుము. ఓ వృద్ధరాజా ! నేను నిన్ను సాక్ష్యమర్థించినందులకుఁ గదా నాపై నీకింతయనుమానము. కావలయునన్న నిట్టిమణులం వేనవేలు నేను గణింపలేనా?

మ. చటులప్రౌఢి వియన్మణిన్ దలిచి నీ ♦ సాన్నిధ్యమందుంపనా
నటదీశోత్కట కాలకంఠసవస ♦ న్నాగేంద్రభోగచ్ఛటా
తటకూటస్ఫుటరత్నసంచయములం ♦ దర్పించి తెప్పింపనా ?
పటుగర్వోద్భటవిద్విషద్భటభిదా ♦ ప్రక్రాంతచక్రంబునన్.

శత—ఈ డాంబికవచనంబులకేమిలే.

కృ—సత్రాజిత్తూ! యీశతధన్వ నీకుఁ బ్రాణమిత్త్రునివలె నటించుచున్నాఁడు మేకవన్నియపులియై వీఁడే నీమణి హరించెనేమో చూడుము,

గీ. మచ్చికయొనర్చి మెచ్చుగ ♦ మాటలాడి
దుర్జనులు మోసగింతురు ♦ తుదకు నొరుల
బోనుఁ న్మచ్చుమందిడి ♦ బోయవాండ్రు
మాయఁజేసి మెకంబులన్ ♦ బట్టురీతి.

వసం— ఓయీ! అమాయికుఁడా! ఈమాటగూడ నాలోచనీయమే పందికొక్కువలెఁగ
న్నఁగలుత్రవ్వుటకే వీఁడు నీయింటఁజేరినాఁడు వానినిఁకఁ దొందరగా బోనులో
వేయ నుపాయమాలోచింపుము.

రేవ— ఓయి గుప్తబ్రాహ్మణుఁడా! ఈలాటి యిచ్చకాలతో నీవు చిరజీవివై కాకివలె
బ్రదుకుచున్నావు.

శత— మామా! వినుచున్నావుకదా వీనియన్యాయపుఁబలుకులు

క. తనపైవచ్చిన యీనిం
దనునాపైఁద్రోసితాను ♦ తప్పుకొనంబ
ల్కినపల్కులివ్వి నమ్మకు
చేఁటిని దలదడిపి బాస ♦ చేసినయేనిన్.

సత్రా— ఈవృత్తాంతమంతయు నాకు నత్యాశ్చర్యముగానున్నది. నేనెవరిమాటలని న
మ్మెదును. కృష్ణా! శతధన్వా! మీకిరువురకు నేనొకమాటఁజెప్పెదవినుండు. నాకు
సత్యయనునొక్క కన్యారత్నంబుకలదుకదా. ఇంతయేటికి?

శా. ప్రారబ్ధంబునఁ దీనుబద్ధ నసుడ ♦ ప్రాణంబునే వీఁడు తే
నేరండమ్మణియుందమా యెచటనే ♦ నిన్ జిక్కఁగావచ్చు నేఁ
డో రేషోశతధన్వుఁడో మఱియు నీ ♦ వో లేక యింకెవ్వఁడో
చోరుండేటికి నాకు దాఁచినెవఁడి ♦ చ్చునో వాఁడె నాయల్లుఁడౌ.

శత— ఓరీ! రేవంతా! కార్యము మించివచ్చినదే నేనామణి యెక్కడ సాధింతును.
సాధింపకున్న సత్యనాకెట్లుదక్కఁగలదు.

రేవం— (రహస్యముగా) సాధించినను లేకున్ననుఁ బరువునకైన మాటయని చూడుము.

శత— మామా! అట్లైన నీవామాటమీఁద నిలిచియుండుము.

వసం— ఓయీ! నిర్భాగ్యుఁడా! ఇప్పటికైన వీఁడు దొంగయాట నీకరూఢమయ్యెనా?
ఆమణి వీఁడేహరించినాఁడు. నీవిప్పుడు మాటునిచ్చెదను నాసతోఁ దెచ్చి యి
చ్చెదనని చెప్పుచున్నాఁడు.

సత్రా— నాకెవ్వరెట్లిచ్చిన నేమి? మణి మఱల నాకులభించుటయే నాకుంగావలసినపని.
ఆలాగు మణి యిచ్చినవానికి నాకుమారినిచ్చుట తథ్యము.

వసం—సత్రాజిత్తూ! కన్యావిక్రేతవై యిదివఱకేమాత్రము ధనముసంపాదించినాఁడవు పిల్లనిచ్చెదనని యాసపెట్టి నగలక్రిందనియుఁ జీరెలక్రిందననియు నీశతధన్వ నొద్దనుండి యెంతసొమ్ము లాగినావేమి?

సత్రా—మహాబ్రాహ్మణుఁడవైన నీవు నన్నాక్షేపింపవలసినదే.

కృ—మిత్రమా! ఈశతధన్వుఁడు మణి హరించి యేయుండునా యేమి. నిజముగా వీఁడే మణిహర్త యైనచో నాకోరికలన్నియు వ్యర్థములుకదా.

వసం—విచారింతము రమ్ము.

కృ—సత్రాజిత్తూ! నేనును నమ్మణికై ప్రయత్నించెదను. నీవనినమాట మాత్రము తప్పిపోకుము.

సత్రా—ఇటు సూర్యుఁడటు నుదయించు నెట్లు?

కృ—అలాగైన మాకు సెలవిమ్ము. వసంతకా! రమ్ము. (నిష్క్రమింతురు)

సత్రా—నేనును బోయివత్తును. (నిష్క్రమించును)

శత—అయ్యో! నాయదృష్టరేఖఁ దుడిచింప నీకృష్ణుఁడెక్కడనుండిదాఁపరించెనో! అయి నను గృష్ణుఁడు చేసినదేమున్నది; అక్కటా! ఎంతలో నెంత వైపరీత్యము జరిగినది.

మ. అకటా! పీఁటలమీఁద పెండ్లివృథసే ◆ యన్ నాఁడునాపాడు వేఁ
టకు నేలాంచసనో శ్యమంతకముతో ◆ డగ్ మాపత్రి సేనుండదే
టికిజోరుంకు మణిన్ హరించి వనవా ◆ టిన్ వానిశాసించె ం
తకుఁబ్రార్ధ్గునాఖరమణికిన్ ◆ దప్పించెఁబంతంబునన్.

అయ్యో! రేవంతా! ఇంకను నాకీదురాశ యేఁదులకు అచక్కఁదన లమక్కనాఁటి నిర్భాగ్యునకుఁ దక్కునా? కాఁగలవివాహము నకిన్ని విఘ్నములేల దాఁపరమగు? మణిగణించి తెచ్చి సత్రాజిత్తున కిచ్చినఁగదా యామచ్చకంటి నాకుభార్యయగుట మాయావియగు గోపాలునితోఁ బ్రతిఘటించి నేను మణిసాధించెదనట కల లోని వృత్తాంతంబు. ఏమి సేయుదును (ఆలోచించి) రేవంతుఁడా! ఈవిషయ మై మనచిరమిత్రుఁడగు శంబరాసురుండేమైన సహాయము చేయునేమో? వాఁడు కంసమిత్రుండగుటఁజేసి కంసధ్వంసియగు కృష్ణునితో నెల్లప్పుడు బలవద్విరోధం బు వాటింపుచుండును. మథురాపురంబున కేగి వానింబిలిచికొని వత్తువా!

రేవం—స్వామి యాజ్ఞయైనట్లు.

శత—శీఘ్రంబుగఁబొమ్ము.

రేవం—(నిష్క్రమించును)

శత—రేవంతుఁడేగునంతకు వారలు మధురాపురంబుననుండరో లేదో!

రేవం—(ప్రవేశము)

శత—ఏమి రేవంతుఁడా! అప్పుడేవచ్చితివి?

రేవం—శంబరాసురుఁడిప్పటికేవచ్చెను.

శత—ఏఁడీ ఏఁడీ?

శంబ—(ప్రవేశము)

శత—మిత్రమా! అందఱు క్షేమమా?

శంబ—అయ్యో! రామకృష్ణులిరువురు సజీవులైయుండఁగా మాకు క్షేమమెక్కడిది? మఱియు,

శా. శూరోత్తంసునిఁ గంసుఁ జెలులతోఁ ♦ జుట్టాలతోఁ సేనతోఁ
బోరన్ జంపిన రామకృష్ణుల శిరం ♦ బుల్ నేలపైరాల్చి వీ
రారంభంబునఁ బద్గళద్వ్రణవిని ♦ ర్యద్రక్తకల్లోలినీ
ధారాస్నాతుఁడఁగాక నాహృదయసం ♦ తాపంబుచల్లారునే.

శత—(రహస్యముగా) రేవంతుఁడా! వీనికి రామకృష్ణులపై వైరము విస్తారముగానున్నది యిది మనకార్యంబునకు మిక్కిలి యనుకూలముకదా. అదిగాక తలంచిన మాత్ర యీతఁడిక్కడికివచ్చుటయు మనప్రయత్నంబునకొక శుభసూచకం బనియే తలతును. ఏమందువు?

రేవం—అవును. కాఁగలకార్యంబున కెల్లపుడీలాటిశుభశకునములు పొడఁగట్టుచుండుట సహజము. వీనివలన మనపనిపూర్ణముగాఁ దీఱిపోదు.

శత—మిత్రమా! శంబరా! సమయమువేచియున్న నీకు రామకృష్ణులనాఁటికేనిఁ జిక్కకపోరు ఏనాఁటికోయననేల యిప్పుడు నామూలకముగా నీకుసమయము దొరకినది

శంబ—అదియేమి? చెప్పు చెప్పు.

శత—నేనువరించిన సత్రాజిత్తుకూఁతును దానుగూడవరించి నావివాహమునకు భంగము జేయుటకుఁ గృష్ణుఁడిప్పుడు ప్రయత్నించుచున్నాఁడు.

శంబ—పిల్లనిచ్చువాఁడు సత్రాజిత్తు నీపక్షమైయుండఁగాఁ గృష్ణుఁడెట్లు నీవివాహమునకు భంగముగావింపఁగలఁడు.

శత—ఆవృద్ధరాజునకొకమాటయా యొకపలుకా! తాను ప్రసేనునికారణమునఁ గోలొప్పి

యీమణి నెవ్వఁడు తనకు సంపాదించియిచ్చునో వానికిఁగన్యనిచ్చెదనని యిప్పుడు చెప్పుచున్నాఁడు.

శంబ— నీవుఁగన్యనిచ్చుటకు నొప్పుకొని యిదివఱకే వివాహప్రయత్నములు సయితము చేసినాఁడుకదా.

శత— అయ్యో! అంతకు సిద్ధమైనవివాహమునకే యిన్నియగచాట్లు! ఏమిచెప్పుదును.

సీ. సరసాలాపము లాడుచుఁ బడతులతో ♦ సత్రాజితీ! పెండ్లి రే
పనుచెంచుఁ శతధన్వ నీమగని పే ♦ రాసక్తి పల్లింపుమా
పేరఁటాండ్రెదుట పెండ్లిలోనన ముదం ♦ పుంగోపముఁ లజ్జయుఁ
బెరయుఁ మోమువంచుచుండునట్టుస ♦ స్త్రీరత్న మొయ్యారియై.

శంబ— మిత్రమా! చింతిపకు నిర్వక్రపరాక్రమ తేజోవిరాజితుఁడు నీశంబరాసురుఁడు నీకై తనప్రాణములనైన వర్పింప సిద్ధముగానుండఁగాఁ గృష్ణుఁడెట్లు మణిసాధించి తెచ్చిసత్యం బెండ్లియాడఁగలఁడు. అదిగాక యాశ్యమంతకమే పొంతఁజే ననీ కేమి వినుము.

మాలినీవృత్తము. ప్రకటితఘనమాయా ♦ ప్రౌఢవిద్యాసవద్య
ప్రకృతివిధుతమాత్రా ♦ రాతినో నాకు కృష్ణుం
డొకగణనయె కేళీ ♦ యుక్తి నామాంకం బే
టికిఁ గొసచనుదెంతున్ ♦ శీవినాపాపుబోశిన్.

శత— మిత్రమా! నీవచనములు నాకిప్పుడు సుధారసధారలుగానున్నవి. ప్రాణమిత్రుఁడవఁగా నీయట్టివాఁడేకదా చూడు,

ఉ. బాగుగనున్న చోఁ బరగు ♦ బంధువులందఱుభూమిలోన నా
బాగుమఱొక్కలాగయిన ♦ బంధువుఁడొక్కఁడు గానరాఁడు బా
గోగులనొక్కరీతి నెనఁ ♦ డొక్క సుహృజ్జన వృత్తికుండు నాఁ
డేగద ప్రాణమిత్రుఁడు స ♦ మీడితబంధుఁడు మాకు నాత్మికిన్.

ఇఁక నాకార్య మనివార్యముగా నెఱవేఱునని యేఁదలంచెదను.

శంబ— నెఱవేర్చి దేయనుకొనుము. ఇంకను దానికై చేయవలయు కార్యాలోచన మొనర్చి గింతురమ్ము. (నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము.

సంపూర్ణము.

# సాత్రాజితీయము

## ద్వితీయాంకము.

రంగము—ద్వారకాపుర బాహ్యోద్యానవనము.

[ప్రవేశము శతధన్వుని సేవకుఁడు రేవంతుఁడు]

(కన్నులు నులుముకొనుచు నోటఁ బిలుచుచు నావులించుచు) రామరామా! భొత్తుగా నిద్దురయన్నమాట లేక యవయవములన్నియు బిఱుగఁగొట్టినట్లున్నవి. కనుఱెప్పల కుఁగొండంత బరువుగట్టినట్లుండి తమంతట తాము మూఁతిలఁబడుచున్నవి. యెట్టులో ప్రయత్నము చేసి ఱెప్పలు పైకెత్తితినా కనఁబడు వస్తువులన్నియు నేమో బూచులుగాఁ గనఁబడుచున్నవి. ఒకపగలా ఒకరాత్రియా మూఁడుపగళ్లు మూఁడు రాత్రులు నిద్దురయన్నమాట లేక కన్నపుదొంగలవలె నూరంతయు నేనును మాస్వామియగు శతధన్వుఁడు నా తనిచెలికాఁడు శంబరాసురుఁడును మణికై వెదకివెదకి అలసిసొలసి విసికి వేసారితిమి. ముక్కిడి మానిసులందును నారక్కసి ముండకొడుకునకేమి. వాఁ డెన్ని రాత్రులైనను నిద్రగాయఁగలఁడు. నేనొక్కక్షణమును భోజనకాలమున కాలస్యమైన నోర్తునుగాని నిద్దుర కట్లోర్వను. ఇప్పుడీ యుద్యానవనమునకు వచ్చు కళావతితోఁ గొన్ని రహస్యములు చెప్పి రమ్మని స్వామియైన శతధనుఁడు నన్నంపెను. కళావతి యిచ్చట నున్నదేమో పిలిచెదను (అని) ఓ కళావతీ! కళావతీ! (ఎవ్వరు పలుకకుండుటం జూచి) ఎవరున్నా రిచ్చట వల్లకాటివారు అరచి యరచి నాగొంతు పగిలిపోవలసినదే కాని ఇచ్చట పలుకువా రెవ్వరు లేరు ఆబానిస కూఁతురు నిక్కుచు నీల్గుచు సొక్కుచు సోలుచు నెప్పటికిచ్చటికి వచ్చునో! అందు కక్కడ నీ క్రొమ్మావి గున్న నీడఁబరుండి హాయిగా నిద్రాసౌఖ్య మనుభవించెదను.

(పరుండి గుఱుపెట్టి నిద్రపోవుచున్నాఁడు)

(ప్రవేశము విదూషకుఁడు వసంతకుఁడు)

మాకృష్ణుండే వేళ నాసాత్రాజితిం జూచెనో కాని యాతని విరహమంతయు ఈముసలివాని చావునకు వచ్చినది. ఆసత్యభామ ఈకదళీకారామమునకు వచ్చియున్నదేమో

మా చిరమ్మని సన్నాతఁడు పంపఁగా నిచ్చటికి వచ్చితిని. (అని నడచుచు) ఈ కెలంకుల నెక్కడను జెలువలయొక్కడియే లేకున్నది. (అని ముందుజూచి) ఓహో! వీఁడెవఁడు. కృతయుగమునాఁటి కుంభకర్ణుఁడు మరల నీద్వాపరమునఁ బ్రత్యక్షమయినాఁడు. ఓరీ! వీని గుఱ్ఱు క్షీరసాగరమథనధ్వనిని ననుకరించుచున్నది. దాఁక నంటివెడఁద నోరుదెఱచికొని ఈఁగలుమూఁగుచున్నను దెలియక గుఱ్ఱుమని నిద్దుర బోవుచున్నాఁడు వీఁడు రేవంతునివలెనున్నాఁడు. (అని సమీపించును)

రేవం—కళావతీ! యెంతసేపటికి వచ్చితివే? (అని కలవరించును)

వసం—వీఁడే మోకలవరించుచున్నట్లున్నాఁడు. వీనిచేత నింకను బ్రేలించెదను. రేవంతుఁడా! యిప్పుడే వచ్చితిని.

రేవం—కళావతీ! శతధన్వుఁడు కృష్ణరూపమునవచ్చుచున్నాఁడు. సత్యభామ నుద్యానవనమునకుఁ దీసుకొనిరమ్మి

వసం—ఎప్పుడు?

రేవం—సందెవేళను పిమ్మట శంబరుఁడు సత్యభామరూపముతో వచ్చును.

వసం—అలాగా? (తనలో) మాయావియైన శతధన్వుఁడు సాత్రాజితినెత్తికొనిపోవుటకుఁ బన్నిన పన్నాగము గాఁబోలును. నేనీవృత్తాంతము మాగోపాలున కెఱింగించిముం దాతని నిక్కడికిఁ దీసికొనివచ్చెదను. (అని నిష్క్రమించును)

[పిమ్మటఁ గళావతి ప్రవేశించుచున్నది]

కళా—కృష్ణునిపైననే కాఁబోలు మేల్పడి మిక్కుటమయిన మదనతాపముచే నస్వస్థగా నున్న భర్తృదారికకై మృణాళములను లేఁతయరఁటాకులను గొనిపోవ నేనియుద్యానవనమునకువచ్చితిని. ఎంతచెప్పినను మాశతధన్వునిమాత్రము సత్యభామ వరించునట్లు లేదు. (ముందు నడచిచూచి) ఏటికో రేవంతుడిక్కడఁబడుకొని నిద్రించుచున్నాఁడు. రేవంతుఁడా! లేలెమ్ము (అని చేతితోఁ దట్టును)

రేవం—గుఱ్ఱుపెట్టుచు పొర్లుచున్నాఁడు.

కళా—చచ్చినవాఁడా! బావురుబిల్లులు పోట్లాడుచున్నట్లున్న నీగుఱ్ఱు విని నాకు భయమగుచున్నయది. ఈపాటికి నీవు నిద్రలెమ్ము.

(అని కొట్టుచున్నది)

రేవం—(అదిరిపడి లేచి వికారముగాఁజూచుచున్నాఁడు)

కళా—ఓరి కుంభకర్ణుఁడా! నీవక్రపుఁజూపులు మానివేసి యీపాటికి నీవు మేలుకొమ్ము

రేవం—ఎవరిది. (పరికించి) కళావతీ! నీవఁటే నీకడుపుడక సత్యభామను నేనుచెప్పి నట్లు ద్యానవనమునకుఁ దీసికొనివచ్చితివా?

కళా—ఎవరుచెప్పినట్లు?

రేవం—నేను నీతోఁ జెప్పలేదఁటే

కళా—ఎప్పుడు?

రేవం—ఇంతకుమునుండే!

కళా—నేనెఱుఁగనే

రేవం—(తనలో) నేనునిద్దురమబ్బునను అవ్వరితోనైన నసందర్భముగా వాగితినాయేమి? యేమో కానిమ్ము (ప్రకాశముగా) కళావతీ! స్వామియైన శతధన్వుఁడుగారు నీకుఁగొన్నిరహస్యములుచెప్పుమని నన్నంపెను ఇటువినుము.

(అని తలపట్టుకొనుచున్నాఁడు)

కళా—అక్కడనుండి చెప్పుదూ. ఇక్కడ నెవరున్నారు?

రేవం—ఓసి పిచ్చిదానా! గోడలకు సహితము చెవులుండునే.

(అని చెవిలో రహస్యమభినయించును)

కళా—మంచియుపాయమాలోచించినావు.

రేవం—మేమెట్లాలోచించినను నీసహాయములేనిచో శతధన్వునకు సత్యభామ దక్క నేరదు.

కళా—నాచేతనైనన్ని పాట్లుపడెదను. నాబహుమతిమాట మఱచిపోవలదనిమీశతధన్వునితోఁ జెప్పుము. ఆసత్యభామ కృష్ణునకుంగాకుండ నేనును ననేక మాయోపాయములంబన్నుచునే యున్నాను. రుక్మిణిచెలికత్తెయగు మదనికతో “ఏమే కృష్ణుఁడుసత్యనుబెండ్లియాడుటకుఁబ్రయత్నించుచున్నాఁడఁట. ఈవృత్తాంతము మీదేవితోఁ జెప్పుము. నీకును మంచికానుకదొరకును” అని చెప్పితిని. రుక్మిణియెట్లును కృష్ణునిప్రయత్నము సాగనీయదు

రేవం—మంచిపనిచేసితివి. నీవు నీశక్తియంతయు శతధన్వునకై దారవోసిపనిచేయుము నీకష్టముంచుకొనువాఁడుకాడు.

కళా—చూచెదఁగదా నేనుతొందరగా మృణాళములు సేకరించుకొని పోవలయును లేకున్న నూరకయే నన్నుజూచిన మొగము మాడ్చుకొనుచుండు సత్యభామకు మఱింతకోపమువచ్చును. దాస్యమునకై యొకరికి శరీరమమ్ముకొనినప్పుడు స్వ

తంత్రితయొక్కడిది? కూరుచున్న నొకతప్పు నిలుచుండిన నొకతప్పు నీవుపొమ్ము నేను సంకేతవేళ కీయుద్యానవనమునకు సాత్రాజితినెట్టులయినఁ దీసికొనివచ్చెదను. శతధన్వుని యథావిధిగా రమ్మనుము.

(ఇరువురు నిష్క్రమింతురు)

[ఇది ప్రవేశకము]

[పిమ్మట వసంతకద్వితీయుఁడై కృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు]

వసంతకా! మనమా రేవంతుని కలవరింపుఁబలుకులయందు విశ్వాసముంచి యీకదళీకారామమునకువచ్చితిమి. నీవుచెప్పినవృత్తాంత మెంతవఱకునిజమో యూహింపరాకున్నది.

వసం — ఊహించుటకేమున్నది. శతధన్వుఁడును నారేవంతుఁడును నిరంతరమీ దురాలోచనములఁజేయుచుండినఁగాని నిద్రయందుఁగూడ నవి తలఁపునకువచ్చికలవరింపుల మూలకముగా వెలిఁబడవు. మితిమీరఁ దినకుండఁ గడుపునొప్పిపుట్టదుగదా!

కృష్ణ — సరియేకాని వానికలవరింపువలన నీవేమని యూహించితివి?

వసం — నీయందు సత్యకనురాగముకలదని స్పష్టముగాఁ దెలిసినది.

కృష్ణ — ఎట్లు తెలిసినది?

వసం — నీయందామెకు వలపుండుటంజేసియే నీరూపముధరించి తాను సత్యకడకువచ్చెదనని శతధన్వుఁడు చెప్పినట్లు రేవంతుఁడు కలవరించెను.

కృష్ణ — మిత్రమా! ఈవిషయమయి నీకున్నంత విశ్వాసము నాకులేకున్నది ఏమన,

చ॥ పరిచయమేమి చొప్పడదు, ♦ పావనసత్కులధన్యకన్య యీ
వరకె మదింగుతించి యప ♦ వాదము మోసితినా పె[illegible]చే
నిరవనియేమిసేయునది ♦ యేమగునో భవదీయవాక్యముల్
పొరిపొరిసూపుచున్నయవి ♦ పో మది నుయ్యెలలీలనాసలన్॥

వసం — పరిచయము నీవకలిగించుకొనవలయునుగాని యూరకయెట్లుకలుగును? అడుగనిది అమ్మయైనను బెట్టదు. పోనీ నీవామెను చూచితివికదా- యిప్పుడామెను గుఱుతైనఁబట్టఁగలవా? అదిచెప్పు?

కృష్ణ — అయ్యో మిత్రమా! అట్లందువేమి?

చ॥ తలఁపునగట్టిగానిలిపి ♦ ధారణఁజేసి లతాంగి రూపమున్
దలఁచుకొలఁదినాచెలి య ♦ ధాస్థితి నచ్చునఁబోసినట్లుగా

మెలఁగెదు నా సమక్షమున♦ మేనుగగుర్పొడుచున్ యథార్థపుం
బులకలొ నిర్ణయింపుమివి♦ యుద్దియుఁ ద్దవుఁజూపుఁదూపులో॥

వసం—ఇవియన్నియు మన్మథపిశాచమావేశమైనప్పుడు పుట్టుచుండు వికారములు

కృ—ఆహా! భగవానుఁడా! కామదేవా! నీవొక్కఁడవే జగదేకవీరుండవు చూడు.

మ॥ కినుకన్ నిన్ను హరుండు ఫాలనయనా♦గ్నిన్ గాల్చి భస్మంబుగ
ప్పిన యేనిన్ బెనుబూదివై జగములన్♦ వేధింతు పూఁదూపులన్
గొని వజ్రాయుధధారినే గెలిచి యం♦చుల్గట్టియాడింపనె
వ్వని నీ వేమియొనర్పవంగజ! భవ♦ద్వ్యాపారముల్ చిత్రముల్॥

వసం—మిత్రమా! యీకదళికారామముఁ జూడుము.

కృ—ఈయారామము మాశ్యామణిలావణ్యమే నాకుస్మరణకుఁదెచ్చుచున్నది చూడు,

మ॥ అళులు, సరోజముల్, కిసల♦యంబులు, కల్వలుపుష్పగుచ్ఛముల్
నలినమృణాళముల్లతల♦నంటులు, నెచ్చెలికిన్ లతాంగి సొం
పులఁదలఁపించి నాకువల♦పుందమిఁ బెంచుచునున్న వింక నే
నలకలవాణితో సరస♦మాడి కృతార్థుఁడనౌట యెన్నఁడో॥

వసం—మిత్రమా! నీవు విస్తరిలో వడ్డించుచుండఁగనే తొందరపడుచున్నావు.

కృ—ఇదిలోకసామాన్యమే చూడు.

గీ॥ వేశ్యఁగార్యంబుదొరకొను♦ వేళకన్న
నాస హెచ్చుఫలోన్ముఖం♦ బగుచునుండ
నధికమగుమిక్కిగానున్న♦ యదనుకన్న
పెద్దదైచెట్టు ఫలమిచ్చు♦ వేళనాస॥

వసం—ఇంతకు నీవలపువృక్షము ఫలోన్ముఖమైనదని ధైర్యముకలిగినదా?

కృ—సత్యాగమనసంతసమయమునంగాని చిగిర్ప నేరదు.

వసం—ఆమె నీపాటికీకదళికారామమునకుఁ గళావతితీసికొని వచ్చియే యుండును.

కృ—వచ్చినదేమో చూచెదము ముందు నీవునడువుము.

వసం—నాకు శుభలేఖవ్రాసియిమ్ము. రావలసిన దోవతులచాపక్కడనే రాఁబట్టు
కొందును

కృ — దోవతులచాపుకాదోయీ కంకణములేవచ్చునా.
వసం — వేనికిఁ గంకణములు?
కృ — నీరెండుచేతులకు
వసం — కాదు రెండుకన్నులనుము
కృ — అదియేమి?
వసం — నీకును నీక్రొత్తకన్నియకును మధ్యరాయబారము లు చేసినందులకు రుక్మిణీదేవి నావెన్నుపాము విఱుగఁగొట్టుటచేత నారెండుకన్నులకును గావలసినన్ని కంకణములు అనఁగా కన్నీళ్లు.
కృ — వసంతకా! భయంపడకు.
వసం — నీవుకూడ నాశిక్షలోఁ గొంతపంచుకొందువు గనుక నాకంతభయము లేదు.
కృ — సరికాని వసంతకా! యింకను నానెచ్చెలి యిచ్చటికి వచ్చినట్లగపడదు.
వసం — రాలేదని నీకెట్లు తెలిసినది?
కృ — మిత్రమా! ఎట్లు తెలిసినదా! చూడు మిచ్చట,

ఉ॥ తరుసంతానము నూత్నదోహదనితాం ♦ తశ్రీలఁ జింపారలే
దరయన్ దెమ్మెరకున్ గురంగమదగం ♦ ధామోద మేలేదు నా
సరసాలాప వయస్యలన్ గలిసి ము ♦ చ్చట్లాడినట్లీవనాం
తరమందున్ బ్రవహింపలే దురుసుధా ♦ ధారాసరిజ్జాలముల్॥

వసం — ఆలాగైనఁ గొంచెము ముందునకు పొము
కృష్ణ — (నడచుచు) మిత్రమా! ఇక్కడనిలుము నాచెలియచే దోహదక్రియలంగాంచి పర్ధిల్లు నీవనస్పతులేమయినను నాయమరాక తెలియుంగఁ జేమో యడిగి చూచెద,

మ॥ మెలఁతన్ గాంచితివే యశోకమ! యిదే ♦ మేపల్కు వాకిల్కు పై
నలుకాతన్నంటంచుఁ ఁన్న? సురపొ♦న్నా! నిన్ను నన్ గన్న న
వ్వులపాల్సేయుమటంచు నల్కువినలే ♦ వో మాట! నీ వేనియున్
దెలియం బల్కు రసాలమా! చెలి మునున్ ♦ గేలం టిలాలించెడిన్॥

(కొంచెమాలకించి) మిత్రమా! నాపల్లవపాణికమ్మావి తనచిగురాకువన్నియ నపహాసించుచున్నదను నీరసముచేఁ గాఁబోలు నీరసాలమును నాసుదతియొసఁగోపరక్తిమునే వహించి యూరకున్నది చూడు

వసం — ఊఁఊఁ లేదు దానిమూగసైగలు నీకుఁ దెలియలేదు కాని పిల్లగాలిచే మెల్లఁగాఁ గదలుచున్న తనచిగురాకు చేతులతో నీచెలియ యీవంకగా వచ్చుచున్నదని

నీకుఁ జెప్పుచునేయున్నది చూడు మాప్రక్కనుండి మట్టెలరవళిగూడ విన వచ్చుచున్నది.

కృ—(చెవియొగ్గి) నిజమేసుమీ!

గీ. దట్టమగుతీవ పొదరిండ్లు ♦ దాఁటి యిటకు
వచ్చుచున్నది చూడు నా ♦ ప్రాణపదము
నిబిడమగు మేఘపంక్తుల ♦ నిర్గమించి
జోకనేతెంచు జాబిల్లి ♦ రేకవోలె.

వసం—ఏదీ ఏదీ ఎక్కడెక్కడ. (అని చిందులు త్రొక్కుచున్నాఁడు)

కృ—మూర్ఖుఁడా! నీవిప్పు డల్లరిచేయకుము. నిన్నొక పెద్దమర్కటమనుకొని స్త్రీజనము బెదరిపోవును.

వసం—పెద్దమర్కటము నేనైనయెడల నే గొప్పవాఁడనే యగుదును. ఆజాతియేకదా సముద్రమునకు సేతువుగట్టినది.

[పిమ్మట యథోక్తముగా సాత్రాజితీ, కళావతీ మంజువాణులతోఁ బ్రవేశించుచున్నది.]

మంజు—భర్తృదారికా! ఇటు యిటు.

కళా—నెచ్చెలీ! రమ్మా. ఈకదళీకారామము చిగురాకుచేతులతో నిన్ను రా రమ్మని పిలుచుచుఁ జిలుకపలుకులచేఁ గుశలప్రశ్నలడుగుచున్నది.

సాత్రా—కళావతీ! నేనును నానెచ్చెలులైన యిచ్చటికన్నెతీవియల నెట్టులెట్టులాదరింపవలయునో యట్టులే యాదరించెదను. అవ్వైపునకుఁ బోవుదము రమ్మా.

కృ—వయస్యా! ఈమెసౌందర్యం బసదృశము గదా చూడు,

చ. పొలఁతుక నెన్నినాళ్ళు తల ♦ పోసి సృజించెనో యవ్విరించి, యా
కళుకుఁగనుల్కపోలముల ♦ కాంతియుఁ బల్చనిమోవితీవి, వ
ర్తులకుచపాళిసంపదయు ♦ దోర్యుగలీల పిఱుందుచందమున్
మలచినరీతి దాపినక్రి ♦ మమ్మునందిర్చినయట్లు రాజిలెన్.

మిత్రమా! ఈకన్యారత్నమును జూచుటకు నాకు నేత్రద్వయము చాలకున్నదికదా!

వసం—ఎట్టులో యింద్రుఁడు వేయికన్నులను సంపాదించినాఁడు నీవట్లు చేయలేక పోయితివి.

కృ—వసంతకా! నీవిప్పుడు హాస్యములు చాలింపుము. తదేకనిష్ఠాగరిష్ఠుఁడనై నాయ న్నమిన్నం గన్నులారఁ గాంచెదను.

శా. ఆమూలాంబుగఁ బుల్కరించెడి వయ ♦ స్యా! నేను, పూఁబోఁడిని
మోముందామరపై, విశాలనయనం ♦ బుంగల్వపూదోయిపై
సామోద స్తనమంజరీయుగళిపై ♦ నత్యంతమూర్ఛ సైగలీ
లామోదంబున మత్కటాక్షమనుపం ♦ బాసక్తిఁ గ్రీడింపఁగన్.

వసం—వయస్యా! నీవు క్షణమాత్రమూరకుండుము ఈచెలులసంభాషణము విందము.

కృ—ఆలాగైన వారికి నగపడకుండ నీపూవుటీగను మాటునఁ బొంచియుందము రమ్ము.

(అట్లు చేయుచున్నారు)

కళా—(స్వగతము) శతధన్వుఁడు రేవంతునితోఁ జెప్పిపంపిన సెలవుప్రకారమాతని కోర్కె దీర్చుట కేదోయొకమాయోపాయము బన్ని భర్తృదారికను నిక్కడకుఁ దీసికొని వచ్చితి శతధన్వుఁడును కృష్ణరూపంబుధరించి యీపాటికిక్కడకు వచ్చియేయుండును. అతఁడేలాగో యీసాత్రాజితిని నేఁడె తీసికొనిపోకమానఁడు. కృష్ణుఁడే తనకుఁ బెనిమిటి కాఁగలఁడని తలఁచుచున్న భర్తృదారిక పొంగంతయు నేఁటి తోఁ జల్లారును.

మంజు—ఏమే కళావతీ! ఇప్పుడెందుకే పడిపోయినట్లు నన్నును భర్తృదారికను నీసం దవేళ నిక్కడకుఁ దీసికొనివచ్చితివి?

కళా—మంజువాణీ! ఇంతలోనే యలసిపోయితివటే. చేతులార మనము నాటికొనిన పూలతీఁగలకు నీరుపోసి తగిన తరువులకు నల్లుపెట్టకపోయినయెడల వానికిఁ జక్కఁదన మెట్లువచ్చునే?

సాత్రా—ఔనే కళావతీ! నీవు చక్కఁగాఁ బలికితివే.

కృ—వసంతకా! ఈకళావతి పలుకు పొగడఁదగియున్నది చూడు,

గీ. ఒకరికొకరీడుజోడుగ ♦ నుండకున్న
నాయికానాయకులకేమి ♦ హాయిగలదు
లతలకుందగు చెట్లు చె ♦ ట్లకునుదగిన
లతలుగూడనిచోటఁ ♦ జెల్వంబుగలదె.

కళా—భర్తృదారికా! ఇక్కడఁజూడుము; దట్టముగా వేసిన చలువపందిళ్ల నల్లుకొని నిండా

రఁబూచిన సన్నజాజులమీఁదను బండిగురివిందపూవులమీఁదఁ గ్రాలి తీయనితేని యచ్చగ్రోలి యటుపిమ్మట నామూల మదురబండినఁ పనసపండులలోని యోడి కలఁ జవిచూచుటకు నేమో సరసములాడుకొనుచున్నట్లు ఝుంఝుమ్మనుచుఁ బయ వెత్తుచున్న యీ తేఁటిదంపతుల కోలాహలము వినుము,

సాత్రా—కళావతీ! అదేమోకాని యీ తేఁటిదంపతుల కోలాహలము నాచెవులకుఁ గటు వగుటయేకాక తలదిమ్ముగూడ ఘటించుచున్నదే.

కళా—ఆఁహాగా! ఇంతకు నీమనస్సిక్కడ లేదులే.

సాత్రా—(కొంచెము కోపముతో) మఱియెక్కడనున్నదే?

కళా—ఎక్కడ నెందుకుండును? యెల్లకాలము నీకా (శంకించి) ఎందుకులే.

సాత్రా—కళావతీ! ఏమిసరసములేయివి ?

కళా—ఏమి సరసములా? పెండ్లిసరసములు.

సాత్రా—ఎవరిది పెండ్లి?

కళా—ఎవరుతొందరపడుచున్నారో వారిది.

సాత్రా—చాలుఁ లే నేనేమియుఁ దొందరపడుచుండుట లేదు.

మంజు—అలాగైన నీకీయులుకెందుకుగాని పెండ్లియనఁగా నాకొక చిత్రమయినయూహ తోఁచినది; భర్తృదారికా! పుష్పాడియను పసపుఁజీర ధరించి చిగురుదోయిఁటి తో మొగ్గలను ముత్తెంపుసేసల నీసురపొన్నపైఁ బోయుచున్న యీమాధవీలతిక యేలాగున్నదో చూడు;

కళా—భర్తృదారికా! యేలాగున్నదోఁ జెప్పనా?

సాత్రా—చెప్పు.

కళా—ఓపు నీవు పెండ్లికూతురవై శతధన్వునిపై నెగిసి యెగిసి తలఁ బ్రాలుబోయు నప్పుడేలాగుందువో యాలాగున్నది.

సాత్రా—కళావతీ! చాలును. ఆశతధన్వునిపై నీకున్న బాళియంతయుఁ బైకిఁబొంగుచు న్నావు కాఁబోలు యీలాగనఁ బరిహాసములాడుచుండు నీకడ నే నెందుకు నిలువవలయు? మఱియొకచోటికే పోవుదును; మంజువాణీ! రావే పోదము.

(మంజువాణి చేయిపట్టుకొని పోవుచున్నది.)

కళా—పోనీ! నీకింతలో నీ కోపమయిన నేనే వెళ్ళిపోవుదును. (స్వగతము) ఏలాగో నే నిక్కడనుండి వెళ్ళి కృష్ణునిరూపముతో వచ్చిన శతధన్వుని యీమెకడకంపి దీని

తుశ్రీకృష్ణుఁడేగింపవలయుఁగదా. ఇప్పుడు నాకిది యొకమిషగూడ దొరికినది.

(పరిక్రమించును.)

కృ—మిత్రమా! ఈకళావతిపట్టుపట్టి యీకన్నియను శతధన్వునికే యిప్పించి తనపంతము నెగ్గించుకొనునా యేమి?

వసం—పద్మినికిని దోషాకరుఁడైన చంద్రునకును నెవ్వరు సంబంధము కలిగింతురయ్యా! ఆ నామశతధన్వుని పేరు వినినతోడనే నీనెచ్చెలిముఖవైఖరి యేలాగున్నదో దానినైన యోజింపవేమి?

కృ—నిజమేసుమీ చూడు,

ఉ. ఇంచుక లేనియుల్కు నటి ♦ యించి ముఖాబ్జము లేఁతసిగ్గునన్
వంచుటకిన్యకాతతికి ♦ నైజము కాఁగల భర్తపేరు సూ
చించుచు నెచ్చెలుల్ పరిహ ♦ సించునెడన్ జిగురాకుమోవిపైఁ
గ్రొంచెపు నవ్వుపోఁగలుగు ♦ కూరిమిచెప్పక చెప్పుచుండినన్.

అట్టిమందహాసాదికంబు లేవియు లేక శతధన్వుని పేరు వినినతోడనే చిడిముడిపాటుతోఁ బేలమొగంబయి నానెచ్చెలి యీవలకుంబోవుటఁ జూడఁగా నాకిప్పుడూపిరివచ్చినట్లే యున్నది.

వసం—వయస్యా! అదిగోఁ గళావతి యీలాగున వచ్చుచున్నది. నేను నీకడనుండఁగ నాబోనిసమూఁతును చూచినదా నన్ను దెలిసికొనును. కావున నేనీ పొదయందు దాఁగియుండును. అప్పుడు గాని నీరూపముతో వచ్చిన శతధన్వునిగా నిన్నుజూచి పొరపడదు.

కృ—అవును నీవాయారమునందుండుము.

వసం—[అట్లు చేయుచున్నాఁడు.]

కళా—(ప్రవేశించి) ఇంకను మాశతధన్వుఁడు కృష్ణరూపము ధరించి రానేలేదేమి (నవ్వుచు) ఇదుగో ఏమండీ శతధన్వుఁడు గారూ!

కృ—శతధన్వుఁడెవ్వఁడే?

కళా—ఎవరన్నవారే.

కృ—ఓసీ! పిచ్చిదానా! నేను కృష్ణుఁడనే.

కళా—ఔనులెండి నాకుఁ దెలుసును దొంగకృష్ణుఁడవు.

కృ—కళావతీ! ఎట్లుకనిపెట్టితివే?

కళా— ఓయబ్బో! నేదీసినగుంటలో నేనేపడుదునా యేమి!

కృ— నీవు మాయలమారితనమున నందవేసినదానవే కాని నన్నిప్పుడు శతధన్వుఁడని యెవ్వరైనఁగనిపెట్టఁగలరా?

కళా— మొట్టమొదట నేనేపొరపాటువడనంటిని. ఇప్పుడుకృష్ణునకును నీకును నేమియు భేదము లేదు.

కృ— నన్నిప్పుడావన్నెలాడి వరించునా?

కళా— ఇంకేమిసందేహము కృష్ణుఁడే తనకుఁ బెనిమిటికావలయునని యామెక యువ్విళ్ళూరుచున్నదికాని యాసత్యభామ యెట్లైనను నీవిప్పుడేదానిదక్కించుకొనుము

కృ—కళావతీ! ఇదియంతయు నీవుచేసిన సహాయమేకదా నీయుపకారఋణము నే నెట్లుదీర్చుకొందునే

కళా—ఎట్లుతీర్చుకొందువో చూచెదఁగద. ముంజేతులకంకణాలకు నద్దాలెందుకు? కుడువఁ బోవుచుఁ గూరాకు రుచియడుగుటయెందుకు. నేనికఁ బోయెదఁగాని నీవు మెలఁకువతోఁ గార్యముసాధించుకొమ్ము

కృ— పొమ్ము

కళా—(నిష్క్రమించును)

కృ— దీనిమాటలంబట్టి విచారింపఁగా సత్యకు నాయెడ ననురాగమున్నట్టులే తోఁచుచున్నది

వసం—(హఠాత్తుగాఁ బరువెత్తుకొని వచ్చి) వయస్యా! నాకు నిప్పుడు నవ్వునిలుచుట లేదు. ఆతొత్తుకూఁతురుకంట బాగుగా దుమ్ముచల్లినావు. దాని ఋణమేమి తీర్చెదవుకాని యొక్క పాతిక పుంజీలవడలతో నాఋణము నిరవశేషముగాఁ దీఱిపోవును. నీవట్లుచేయుము

కృ—ఆలాగుననేకాని నీవిప్పుడల్లరిచేయకుము. ఆయిట్టిచూపుల కళావతి యెక్కడ నైనఁ బొంచియుండి మనలను మిట్టిచూపులఁ జూచుచున్నదేమో.

వసం— దానికిఁదగిన వేఁటకాడను నేనిక్కడనే యున్నానుకదా. నీవిప్పుడు నిశ్శంకముగా. సాత్రాజితితో మాట్లాడవచ్చును. అదిగో నామె మంజువాణితో నీలాగే వచ్చుచున్నది.

మంజు— భర్తృదారికా! కళావతి కోపమువచ్చి వెళ్ళనే వెళ్లెనుగదా.

సాత్రా — మంజువాణీ! పోనిమ్ము. నేఁడాయన నన్నదేమున్నది. అదే నన్నెప్పుడు ఫుల్లసిలుపుమాట లనుచుండును. నాతండ్రి నాకుఁ జేసిన యుపకారమునకే సంకోచించు చుండఁగా మీఁదుమిక్కిలి కళావతిగూడ సూటిపోటిమాటల నన్నుఁ బరిహాసము లాడుచుండును.

కృ — వయస్యా! ఈయమకు సత్రాజిత్తు చేసిన యుపకారమేమున్నది?

వసం — నిన్ను నింటికిఁబిలిచి యీమెను నీకిచ్చి వివాహము చేయకపోవుటకన్న నామె కింకేమియుపకారము చేయవలయును?

కృ — నీవూఱక నాకాసలు పెంచుచున్నావు.

మంజు — ప్రాణసఖీ! నీతండ్రి నీకేమియుపకారముఁ గావించెనమ్మా?

సాత్రా — నావివాహవిషయమయి యతఁడు నాకుఁజేసినదపకారముగాక మఱియేమిటే?

కృ — వయస్యా! ఆకన్నియ తనవివాహవిషయమయి ప్రసంగించుచున్నది. నీవును శ్రద్ధతో నాకర్ణింపుము.

వసం — వినుచున్నాను.

మంజు — నెచ్చెలీ! ఏమన్నావు?

సాత్రా — ఏమనుకొన్న నేమిప్రయోజనమే

చ॥ వరునికులంబు, శీలమును, ♦ బ్రాయమునారసి కన్నెమానసం
బరసి ప్రియమ్మటఁ బరిణ ♦ యంబొనరించుట పాడిగాక ని
ష్ఠురముగఁ బైడికాసపడి ♦ క్షుద్రునికొక్కనిఁ గట్టి కూఁతుకా
పురమును గూలఁద్రోయుతల ♦ పుల్లలిదండ్రులకుంటధర్మమే॥

మంజు — ప్రియసఖీ! నీతండ్రి పైఁడికాసపడి నిన్నిప్పుడెవ్వని కీనెంచియున్నాఁడు?

సాత్రా — ఎవ్వనికని చెప్పను. శ్యమంతకమణి సంపాదించి తనకెవ్వఁడిచ్చునో వానికి?

మంజు — దానికై యెవ్వఁడు ప్రయత్నించుచున్నాఁడో

సాత్రా — మఱెవ్వఁడున్నాఁడు నాదురదృష్టదేవునివలెనున్న శతధన్వుఁడు తప్ప

మం — ఆపాడు శతధన్వుఁడు నీకు బొత్తుగాఁ దగనివాఁడే సుమీ

సాత్రా — మంజువాణీ!

గీ॥ త్రాచుపామును మెడలోనఁ ♦ దాల్పవచ్చుఁ
గాలకూటవిషంబును ♦ గ్రోలవచ్చు

చిచ్చునం దేహమిచ్చుమె ♦ చేర్పవచ్చు
చెనఁటి శతధన్వు నివరించి ♦ చెడుటకన్న॥

కృ — వసంతకా! శతధన్వుఁడే మణిసంపాదించి తెచ్చి తన్ను వివాహమాడు నేమోయని యీయమ మిక్కిలి శంకించుచున్నది సుమీ.

మంజు — ప్రాణసఖీ! కొన్నినాళ్ళనుండియు నీవేలాగో కనబడుచున్నావు. అరవిడిచి మాతో నైనమాటాడవు. పెంపుడుచిలుకకుఁ జక్కెరఁ దినిపించుచుఁ బలుకుల నేర్పవు ముద్దుముద్దుగా వీణియం బలికింపవు. ఏకాంతమున నీలో నీవేయేదియో యాలోచించుచుందువు. వెన్నెలరాత్రులయందు మునుపటివలె మాతోఁ గ్రీడింపవు. అదియుంగాక నీమనికిఁ జూడ నెవ్వనినో యొక్క మహాపురుషునకై మేలుపడినట్లున్నది.

సాత్రా — (నిట్టూర్పు విడుచుచున్నది)

మంజు — నెచ్చెలీ! ఏమో యాయాసపడుచున్నావేమిటే?

కృ — వయస్యా! మంజువాణి చెప్పినట్లేమె యెవ్వనికొఱకో క్రూరమైన మన్మథార్తికిఁ జిక్కియేయున్నది. చూడు,

చ॥ పడఁతి కపోలముల్ సగము ♦ పండిన మేల్తమలంపుటాకు కై
వడిఁ జెలువారెఁ గ్రొంబసిమి ♦ వన్నియతోడివి పాండురచ్ఛవిన్
యడుగని వేఁడియూర్పులను ♦ నుగ్మలి లేఁజిగురాకు మోవియున్
గడువసివాడియున్నయది ♦ కన్గవ నిద్దుర లేమిఁ గెంపుగన్॥

సాత్రా — (ఉలికిపడుచున్నది.)

మంజు — ప్రియసఖీ! ఏమే యట్లులికిపడుచున్నావు? వట్టి వెఱ్ఱిబాగులదానిని నేనేమియు నీలాటిసంగతుల నెఱుంగను. ఎందుకే నీకింత పరితాపము?

సాత్రా — మంజువాణీ! నే నీపరితాపముతో బ్రతుకుటదుర్లభమే.

మంజు — అయ్యో! నేనిప్పుడేమిచేయుదునే (తత్తరముతో కదళీకాపత్త్రాదికంబులఁగొని వచ్చి) భర్తృదారికా! ఇవిగో యీమంచుతుంపురుల పైఁ జల్లనిమ్ము. గంధమలందనిమ్ము శీతవైన యీయరటాకులపైనఁ గప్పనిమ్ము. ఇదిగోఁ బచ్చకర్పూరపు దుమారమూదనిమ్ము చల్లనితామరపాకు వీవనలను వీవనిమ్ము (అట్లుచేయుచున్నది)

సాత్రా—మంజువాణీ! నిష్కారణముగా నీవెందుకాయాసపడియెదవే. నెచ్చెలీ! యిప్పుడు నాకుఁ దాపమినుమడియగుచున్నది.

కృ—మిత్రమా! ప్రకృతిసుకుమారమైన యీకామినీమణి శరీరమున కింత యాయాసముఁదెచ్చి పెట్టిన యాకఠినాత్ముఁడెవఁడో!

గీ॥ అరయ నైపుణ్యమూర్తినా ♦ మాక్షరములు
చెలి మనమున బడిన నెయ్యంపు ♦ మొలకలయ్యె
నేమనోహరుఁడీ కామి ♦ నీమనంబు
చూఱగొని నిజ స్వార్థ ♦ స్ఫురణఁ గాంచె॥

వసం—మిత్రమా! నీవుగాక మఱెవ్వరుకారుగాని తత్తరపడకు

మంజు—భర్తృదారికా! నీవునాప్రాణసఖివిగాన నడుగుచున్నాను. పద్మినిచేతసూర్యునివలె నీచేతఁ బ్రేమింపఁబడిన యారసికశిఖామణి యెవ్వఁడే?

సాత్రా—మంజువాణీ! అదృష్టహీనురాలనైన నేనుదుర్లభజనానురక్తనై యీలాటిదురవస్థకుఁ బాలైతినిగదా

మంజు—నీకును దుర్లభుఁడైన యంతమహాపురుషుఁ డాతఁడెవ్వఁడే?

సాత్రా—మంజువాణీ! నాకేకాదు సిద్ధవిద్యాధరాది దేవకన్యలకేనియు నతఁడు దుర్లభుఁడే నే.

మంజు—అతఁడెవ్వఁడో నాచెవినివేయవుగా?

కృ—వసంతకా! ఎట్లయినను నాకోర్కె కడముట్టుసమయము వచ్చినది. మంజువాణీ ప్రశ్నమునకీమె యేమనిప్రత్యుత్తరంబిచ్చునో

గీ॥ తత్తరవృటాసనాల్లాడు ♦ చిత్తమునకు
వెలఁదివాక్యంబుసుధయౌనొ ♦ విషమెయగునొ
దప్పిపడి మిన్నుచూచు చా ♦ తకమునోటఁ
బడునదదివానచిన్కొ డౌ ♦ ప్వరపుఁబిడుగొ॥

మంజు—ప్రాణసఖీ! మాటాడవేమి. నినునమ్మిన నెచ్చెలినైన నాయొద్దఁగూడ నీవుబెలుకైనచో నేలాగే?

సాత్రా— మంజువాణీ! సిగ్గునన్ను నోరెత్తనీయకున్నను నెట్టులో చెప్పెద.

మంజు— చెప్పుము

కృ— వయస్యా! నీవు శ్రద్ధతో వినుము.

సాత్రా—

సీ. ఎవనిజన్మమున యా ♦ దవవంశము ఖ్యాతికెక్క
గణ్యమై పుణ్యవ ♦ రేణ్యమయ్యె
నెవని చారిత్రంబు ♦ భవపాతకలతాల
విత్రమై భువన ప ♦ విత్రమయ్యె
నెవనిరూపముగోప ♦ యువతీమనోభాగ
ధేయమై పంకజ ♦ ధ్యేయమయ్యె
నెవనిశౌర్యము సర్జ ♦ రవిరోధకాంతావి
లాపమై త్రిజగత్క ♦ లాపమయ్యె
గీ. చేడె రుక్మిణి యెవ్వానిఁ ♦ జెట్టబట్టి
ధన్యయై కాంతలందు మూ ♦ ర్ధన్యయయ్యె
ఆసాగసుఁగాడు దీనుల ♦ కైనవాఁడు
గోపికలజోడు నామదిఁ ♦ గొన్నవాఁడు.

వసం— వయస్యా! విన్నావుకదా.

కృ— వసంతకా! నేనుబయలుపడుటకిదియేమంచి సమయము. నీవీయుద్యానవనద్వారమునవొక యారకుసందాగియుండుము. శత్రుఘ్నుఁడు గాని మఱియెవ్వరుగాని వచ్చుచుండిన ముందుగా నాకుఁదెలియఁజేయుము. నీవుపట్టియోటినోటివాఁడ వీరహస్యము బయలుపరచక నోరుమూసికొనియుండుము.

వసం— ఇదిగో నేను నోరుమూసికొనియే యున్నాను. (పొదయందుదాగును.)

సాత్రా— మంజువాణీ! అందరానిమ్రానిపండున కఱ్ఱుసాచి నేను పరిహాసపాత్రురాలనైతిఁగదా. లేకున్న జగన్మోహనసౌందర్యవంతుఁడయిన కృష్ణుఁడెక్కడ, నేనెక్కడనే?

కృ—(ఎదుటికివచ్చి)

మ. ఎవనిన్ దుర్లభుఁడంచు నెంచెదో లతాం ♦ గీ! వాఁడె, నీకై మనో
భవసంతాపముగా దపించుచుఁ గడున్ ♦ భారంబుగాఁదీర్ఘపుం

బవళుల్ రేలును బుచ్చుచుండెనళినీ ♦ పత్రోల్లసచ్ఛయ్యలన్
నవనీహారపయోమిళన్మలయజ ♦ స్నానోపచారంబులన్.

సాత్రా — (సంభ్రమమున లేచి సిగ్గుతో) మంజువాణీ! ఈతఁడు మనప్రసంగమంతయు విననే నెనుకాఁబోలు. (పూవుటీరము మాటున డాగును)

కృ — నెచ్చెలీ! నివ్వెరపడి సిగ్గుచేఁ గలదు లేదనునట్టులున్న నీయన్నువ గౌనసియాడఁ బూవుటీరముమాటున కేలపోయెదవు? మనోహారిణీ!

చ. త్వరపడిపోవఁబోకు తెఱ ♦ వా! పెఱవా రెవరిందు? మన్మథ
జ్వరపరితాపతప్తమును భ ♦ వత్సువల్లిక యిప్డు పిల్లతె
మ్మెరనయినన్ సహింపదు సు♦మీ, మరి నూదల కెమ్ము, తుమ్మెరల్
ముఱియుచు నీముఖాబ్జమున ♦ మూఁగును చేరకు పూవుటీరమున్

(సమీపించి)

(స్వగతము) ఆహా! విభ్రమవిలాసకుతూహలాదియౌవనచేష్టాలలితంబయిన యీ లజ్జావతీమూర్తి యిప్పుడు సామానసంబును మఱింత నాకర్షించుచున్నది. ఆహా! యిప్పుడీమె యందు

మ. క్రిమమహామూర్తి సహించె పోవ, మమతా ♦ రంభేత్తి వర్తించె వి
భ్రమమాకారము దాల్చె భావము, సుమా ♦ పవ్యక్తమయ్యెన్ విలా
సము, మైదాల్చి చరించె లీల యసమె ♦ చ్చన్ దాదృశంబైన యీ
కమనీయాకృతి కామసృష్టికి నలం ♦ కారంబుగా నెంచెన్.

సాత్రా — (స్వగతము) అయ్యో! ఈపాపిష్టిసిగ్గుచేఁ బ్రియునితో నొక్కమాటాడుటకుఁగాని కన్నారఁజూచుటకుఁగాని శక్తురాలను గాకుంటిగదా! నీనిప్పుడు ప్రియున కేమని ప్రత్యుత్తరంబిచ్చిన బాగుండును. ఇట్లని మాచెదను. (ప్రకాశముగా) మంజువాణీ! ఇవియేమిటే పట్టపుదేవియైన రుక్మిణియందు బద్ధానురక్తమైనతనమనస్సును నానిమిత్తమున నీతఁడెందుకునాయాసపెట్టుకొనవలయునే?

మంజు — ఏమోనే! నాకీలాటిసంగతులు తెలియవే (నేనుపోవుచున్నాను.)

సాత్రా — మంజువాణీ! నేనునువచ్చుచున్నాను. [పోఁబోవ]

కృ — నెచ్చెలీ! ఆలాగైన నేను నిన్నాశ్రయించికొని రానలసినవాఁడనే [చేయి పట్టుకొనును]

సాత్రా — [చేయియిచ్చి యావలమోమయి] నల్లనీపల్లవా! నిన్నాశ్రయించుకొనియున్న యన్నమిన్నలు వేనవేలున్నారు

కృ — దేవీ! వారందఱికి నీవగ్రగణ్యవయ్యెదవు అదియుంగాక, పుష్పబాణుని జయింప నీవులేక యొందఱున్న నేమిప్రయోజనము మానుము.

మ. కులుకుంజూపులఁదూపులన్ బోమాల సిం ♦ గారంబునన్ జాపమున్
జిలుగుంబల్కులఁ జిల్కరాయరదమున్ ♦ శృంగారవేణీరుచిన్
గలితజ్యాలతికన్ జయించి, సుమబా ♦ ణప్రాజ్యసామ్రాజ్య ని
స్తులభోగంబులఁ దేల్పనీకొలఁదియుం ♦ తుల్లేరు నాకెవ్వరున్.

సాత్రా — కాముకా! నీవంటి రసికులైనపురుషులు మావంటి ముగ్ధాంగనల నీలాగేపలుకులచేతనే లోఁబఱచుకొందురు.

గీ. పదుగురిల్లాండ్రలో వేగ ♦ వలయు భర్త
యింపనఁగఁ గారవముల మొగ ♦ మిచ్చకములు
నెవతె నెటు దేర్పవలయునో ♦ యెఱుఁగఁ డేని
తృణము నగ్గించుకొనలేఁడు ♦ కాపురంబు.

కృ — మానినీ! ఏమి నీవు నన్నింకను సందేహించుచున్నావుగదా. నిన్ను నేనెంతటి యసామాన్యప్రతిపత్తిచేఁ జూచెదనో నీవ తెలిసికొనఁగలవు. విశేషించి,

మ. తరుణీ! నీ విన్నవాశి పోయెనని వా ♦ క్స్థానంబునందుంతునో
మురవిద్వేషిసిరిన్ బలెన్ నిను నురో ♦ భూమిన్ బ్రతిష్ఠింతునో
హరుఁడా పార్వతినట్లు యర్ధనిను ♦ ర్ధాంగంబునన్ దాల్తునో
త్వరలోఁ జూపెదవేల నేఁదఱిమి చె ♦ ప్పన్ మాఁదుగా మానినీ!

అన్నమిన్నా! ఇప్పటికైన నన్ను గన్నెత్తి చూడుము.

సాత్రా — ప్రియా! నేను స్వతంత్రురాలనుకానుగదా. మాతండ్రిమాపినతండ్రికారణమున గోలుపోయిన శ్యమంతకమాణిక్యం బేలాగునైన సంగ్రహించితెచ్చి మాతండ్రికి

చ్చిన నతయుం జక్కఁబడును. కరుణించి తదన్వేషణమునకై త్వరపడి యేగి తె
చ్చి నన్ననుగ్రహింపవలయు.

కృ — దీనికా నీవు సందేహించుచున్నావు. దేవీ! నీవు మేరువునడిమ్మన్నను నేను తేకుం
దునా? ఇంక విచారంబుమానుము,

* మణిగణనికరవృత్తము *

మతివెతవిడువుము ♦ మణివెదకి జగ
త్త్రితయమునను నెల ♦ దినముల మితిలోఁ
జతురతఁబడసి యొ ♦ సఁగి వినుమిఁక నీ
పితరునిమతిదని ♦ పెదగుణవతిరో !

సాత్రా — ప్రియా! అట్లాగైనఁ ద్వరపడుము. నన్ను మాత్రము మఱవకుండుటకీహారము
యొద్దనుంచికొమ్ము.

శా. మారాగ్నిన్ దెగఁగాగి నీలమణిదా ♦ మంబైన ముక్తామణీ
హారంబిద్యుతి నీకొసంగెద నను ♦ గా! నాదుచిత్తంబుతో
నేరాప్తప్రియబునుండితిన్ మఱతు సుమ్మీ ♦ నన్నా! నీరాకకు
న్నేరాన్ దివసంబులన్ క్షణములన్ ♦ లెక్కించుచుందున్ బ్రియా!

[హారమిచ్చుచున్నది.]

కృ — దేవీ! ఇది కామదేవుని ప్రసాదముగావునఁ గన్నులనద్దికొనియెద. (అట్లొనర్చి)
నెచ్చెలీ! ముక్తామణీమాలికా! నీవుగదా యింక మాయనురాగలతకుఁ జక్కని
దోహదంబిచ్చి వృద్ధిఁబొందింపవలసినదానవు. మాకు నీయట్టియాప్తబంధువు
లింక లేరు.

మ. రమణీరత్నము నీ మెడన్ గల గుణ ♦ ప్రాశస్త్యముం జేసి తాఁ
గమనీయస్తనసీమమై లసదలం ♦ కారంబుగా నిన్నుదా
ల్చి మనంబిచ్చి ప్రియాళివంచు నిను బంచెన్ ♦ స్వప్రియున్ గూర్పను
త్తమముక్తామణిమాలికా! యిఁకను దా ♦ త్యంబొప్పుగావించెదో

మంజు — [అవ్వలనుండి] భర్తృదారిక! త్వరపడుము; త్వరపడుము. సాయంకాలమ
గుచున్నది, చూడు;

గీ॥ తను విడిచి నూర్వపద్మినిఁ ♦ దవిలి ట్టి
పెనిమిటియునుండు వచ్చినఁ ♦ గని యనూరుఁ
గోపరక్తిమచే నెదు ♦ రొక్కనిమె నతని
నపరకాంత యదేచూడు ♦ మంబుజాక్షి!॥

సాత్రా—ప్రియుండా! ఆలాగైన నేద్వారపాలనలను.
కృ—నేనును ద్వారపాలుడునే యున్నాను.

(పిమ్మట మదనికతో రుక్మిణి ప్రవేశించుచున్నది.)

మద—అమ్మా! రుక్మిణీ! ఈయుద్యానవనమునందిప్పుడు వెన్నదొంగను నేఁబట్టి నీకీయఁగలను రమ్మా. [అని నడుచుచు] ఇదుగో గర్భచోరుఁడైన వసంతకుఁడు పావురుబిల్లివలె నీపొదలో దాగియున్నాఁడు. వీనినదలించి వృత్తాంతమరయుదము

రుక్మి—ఎక్కడెక్కడ [అని సమీపించును.]
వసం—[తనలో] అయ్యో! నేనిప్పుడు చావనేచచ్చితిని.
మద—దేవీ! ముందు నీవు వీనిపై నాగ్రహింపకుము. నేను మెల్లమెల్లఁగా కృష్ణుని సమాచారమంతయు వీనిచేతఁ జెప్పించెదను. [ప్రకాశముగా] అయ్యా! వసంతకా! నీకు నోటిమీఁదికిఁ జేయివచ్చినదేమి?

వసం—[పొమ్మని చేతితో సైగచేయుచున్నాఁడు.]
మద—అయ్యో! పాపము బ్రాహ్మణుఁడా! నీకీమూగతనమెప్పుడువచ్చినది?
వసం—ఏమే! తొత్తుకూతురా! నేను మూగవాఁడనా?
మద—ఇప్పుడుకావుగాని నోరెందుకుమూసికొంటివి? ఎవ్వరు నీమూతిపైఁదన్నారు?
వసం—ఆ! గోపాలకృష్ణుని వేడుకచెలికాఁడనైన నన్నెవ్వఁడే మూతిపైఁదన్నువాఁడు?
మద—మఱియేమియు లేక యీనోరుమూసికొనుట యెందుకు?
వసం—మాయమన్న గుప్తముగానుండఁదగిన రహస్యమొకటి తెఱవఁబడినపంజరము లోనుండి చిలుకవలె నానోటనుండి యెగిరిపోవును గనుక.
మద—అట్లయిన నీవిప్పుడు నోరుతెఱచియే మాట్లాడుచున్నావు దా?
వసం—లేదు; లేదు. ఇదిగో మూసికొనుచున్నాను. [అని నోరుమూసికొనును.]

మద— ఇదిగో తెలిచితి: చూడు. [అని చేతిపైఁగొట్టును.]
వసం— ఏమే! మదనికా! బ్రాహ్మణునిగొట్టుచున్నావు?
మద— అయ్యో! ఇక్కడిదీరహస్యము? నాచెవిలో దూరి బాధించుచున్నయది.
వసం— ఏమే! మదనికా! నారహస్యము జారిపోయినదా యేమి?
మద— నాచెవులోదూరినదదే. దీనికేనా నీవింతసేపు నోరుమూసికొనియున్నది?
వసం— మదనికా! నీకుఁ దెలిసినదా యేమె?
మద— తెలిసి చాలసేపైనది.
వసం— నారహస్యము!
మద— నీరహస్యమే.
వసం— కృష్ణుఁడుద్యానవనమున సాత్రాజితితో మాటలాడుచున్నాఁడనురహస్యమే!
మద— ఆహా! అదియే. వచ్చినవాఁడా! నీవిందునకా యిక్కడనున్నది. [కొట్టును]
అమ్మా! రుక్మిణీ! యింక నీనిర్భాగ్యుని నీచెట్టునకు బిగిచికట్టుము.
రుక్మి— దుష్టబ్రాహ్మణుఁడా! నీకైజము మానవై తివిగదా?
వసం— అమ్మా! మొదటినుండియు నాకిది యేకూడదు. ఈనాఁడు నేచేసినతప్పునకు మదనికయే నావెన్నుపాము చావఁగొట్టినది నీవింక నూరకొనుము.
మద— అమ్మా! వీనితో నేమి మనము పోదమురమ్మా. [నడచి] దేవీ! అదిగో వెన్నదొంగ
రుక్మి— మదనికా! చూచుచున్నావుగదా భర్తగారిదుర్నయము.
మద— అమ్మా! నీవీసమయమున మెత్తబడఁగూడదు.
కృ— [చూచి] ఆహా! దేవి రుక్మిణీ! రానెవచ్చెనుగదా?
సాత్రా— [పాఱిపోవును]
కృ— [స్వగతము] నేనిప్పుడీమెతో నేమనిమాట్లాడుదును?
రుక్మి— [సమీపించి] కాముకా! నీప్రియత్నము నారాకవలన భంగమైనందులకు నన్ను క్షమింపుఁడు.
కృ— [తనలో] ఓహో! ఈమె కోపకార్యమును మిక్కిలి సరసముగా నుపక్రమించినది.

గీ॥ కినుకఁ జిగురాకు మోవి బి ♦ గింపలేదు
వెలఁది కనుబొమ్మలను ముడి ♦ వేయలేదు
లేతనవ్వులలీల చా ♦ లింపలేదు
పలుక నిఁక మానుచు నే ♦ మనినచింతు॥

అయిన నిట్లనిచూచెదఁ (ప్రకాశముగా) దేవీ! నీవు మఱియొక విధముగాఁ దలంచుచున్నావా యేమి?

రుక్మి—ప్రత్యక్షమునకుఁ దలంపులతో నేమిపని?

కృ—దేవీ! నీవేమనుకొంటివో కాని నేనుమాత్రమునిక్కముగఁ గాంతా! మణినన్వేషింప నిక్కడికివచ్చితిని.

రుక్మి—ఔను నిక్కముగ మీరు కాంతామణినన్వేషింప నేవచ్చితిరి. పాపమన్వేషణ కార్యమై చేఁజిక్కినదికూడ నావలన జారిపోయినదికదా?

కృ—దేవీ! నామాటలను నీవు వక్రార్థములుచేయకుము. నీకన్న నాయనురాగమునకుఁ దావలమైన యాకాంతామణి యెవ్వతె?

రుక్మి—చాలుచాలు నీనయగారములు.

శా॥ పోపొమ్మింతయు నేఁటితో, దెలిసె నీ ♦ మోమోట ముల్లాపములే
పైపై నిచ్చకమాడి వన్నె నునయిం ♦ పంబోకు నీమానసం
బే పూబోఁడిపయిన్ రహించునిఁక నం ♦ దే యుట్టి శృంగారవి
ద్యాపాండిత్యముఁజూపి, తేలుము తదీ ♦ యానందకల్లోలినిన్

(పోఁబోవును)

కృ—(ఆపి) దేవీ! అపరాధిని నిష్కారణముగా శంకించుచున్నావు. ఇది యువతీజనసులభమైన నైజగుణమేసుమా.

మ॥ ఇఁకముందెన్నఁడొ తప్పొనర్తురవి, ముం ♦ దేభర్తలన్ లొంగఁజే
సి కోర్కెన్, గన్బొమలన్ ముడించి, కినల ♦ శ్రీకంబు మోవిన్ బిగిం
చి, కనుంగోయినిఁ గెంపునించి, పయికిన్ ♦ చేసేత నిష్కారణ
ప్రకటక్రోధముఁజూపు టంగనలకున్ ♦ స్వాభావికంబేకదా॥

(చెలికత్తెతో) మదనికా! నీవైన నావిషయమై దేవిగారితోఁ జెప్పవే.

మద—చెప్పవలసినదేదియో యిదివరకే చెప్పియున్నాను.

రుక్మి—గోపాలా! నీమదన సామ్రాజ్యమంత్రియగు వసంతకుఁడే నీయవినయవృత్తాంతమంతయు నాకుఁజెప్పినాఁడు.

కృ—దేవీ! కల్లలకుఁ బుట్టినిల్లగు వసంతకునిమాటలనమ్మికా నీవు నన్నింతకోపగించుచున్నావు. అయినను వాఁడేమిచెప్పెనో నన్నడుగనిమ్ము. వసంతకా! నాపై లేనియపరాధ మేలమోపితివి?

వసం — అయ్యో రామా! నేను నీవు చెప్పినట్లు నోరుమూసుకొనియే కూర్చున్నానయ్యా! యీతొత్తుకూతురు మదనికయే నాచేత యేమో ప్రేలించినది.

మద — నే నేమి ప్రేలించితిని?

వసం — ఏమో నాకు జ్ఞాపకము లేదు.

రుక్మి — ఓ బ్రాహ్మణుఁడా! కృష్ణుఁ డొక్కఁడున్నన్న సంగతి నీ వెఱుఁగవేమి?

వసం — నే నెఱుఁగను.

మద — పోనీ నిన్న నీ వెఱుఁగుదువా?

వసం — ఏమో నే నెఱుఁగను.

మద — నీ విప్పుడిక్కడ నెందు కున్నావు

వసం — ఏమో నాకుఁ దెలియదు.

మద — దేవీ! యీ బ్రాహ్మణుఁడు పట్టికల్లరీఁడుగాని వీని మొదట శిక్షింపుము.

వసం — అమ్మా! రుక్మిణీ! చేయవలసిన శిక్ష యిదివరకే మదనిక చేసినదిగదా?

కృ — (స్వగతము) ఈబ్రాహ్మణుఁడు తెలివితక్కువచే నేదియో కూసియే యుండును. మదనిక మొదటినుండియు నాపై దేవికి చెప్పుచునే యుండునుగదా! అదియుంగాక,

గీ॥ మగలు డవడిపైనను ♦ మానపడును
రాదు వారూరకే తమ ♦ తోడి సకియ
యున్నవియు లేనివియుఁ బన్ని ♦ యూఁదుచున్న
జెప్పవలసిన దేమింక ♦ జెలులయలుక॥

రుక్మి — మదనికా! ఈలాగునఁ బరాభవింపఁబడియు నింకను నే నీధూర్తగోపాలునికడ నేల నిలువవలయును? పోదము రావే [అని పోవుచుండ]

కృ — (చేయిఁబట్టుకొని) దేవీ! నే నింత చెప్పుకొన్నను నీవు నన్నపరాధియనియే తలంచుచున్నావుగదా? ఆలాగైన నన్నేక్రియమున శిక్షింపవలయునో యాక్రియమున శిక్షించి దుర్గొమ్ము చూడుము,

మ॥ కనుబొమ్మల్ముడిఁ జించి మోహనకటా ♦ క్షశ్రీలఁ దగ్గించి యొ
య్యారఁగ మోమ్ము ద్రిప్పి, లోనదరహా ♦ సాంకూరముం దాఁచి కో
పన! పైపై బెదరింపనేల నను నీ ♦ బాహామృణాళంబులన్
మనసారం బిగియించి దోషివయినన్ ♦ మర్దింపుమిచ్చారతిన్॥

రుక్మి—కాముకా! ఇంకను సతుల పరాభవించెదవు?

మ. పెడమోమెన్నఁడు లేదు, దాస్యమునకున్ ♦ వేసారలే, దీలువున్
గడవన్ లేదొకయింతయేనిఁ, బాలయు ♦ లక్కంబూనలే, దిట్లునీ
యడుగుందమ్ములఁగొల్చి నిల్చినను నె ♦ య్యంబీవె యీనాఁటికిం
గడిలోనన్ దెగనమ్ముచుంటివి ని ♦ యింకన్ సైతునే ప్రాణముల్?

కృ—(తనలో) ఆహా! ఇంకనీమె ననునయించుటయెట్లు!

గీ. చిత్తమనుపాత్రమున నున్న ♦ స్నేహరసము
మంతుకోపానలంబున ♦ మరగుచుండ
శాంతివచనామృతంబు పైఁ ♦ జల్లుకొలఁది
మేరమీఱుచు గాంచ ♦ ల్లాఁగలదె.

(ప్రకాశముగా) దేవీ! నీవు కోపకార్యము చక్కఁగా నిర్వహించితివి యింక నైన నాయెడం బ్రసన్నురాలవు కమ్ము. ఇదిగోఁ జూడుము,

మ. ముదితా! బాసయొనర్తు నెన్నటికిఁద ♦ ప్పాజేయనంచున్ భవ
త్పదపద్మంబులపై, నితంబతటిపైఁ, ♦ బాలిండ్లపై మోవిపై,
వదనాంభోజముపైఁ గపోలములపైఁ ♦ బల్మాఱుఁ గేలుంచినే
నిదె యింకేనిఁ బ్రసన్నురాలవగుమిం ♦ తీ మానికాఠిన్యమున్.

రుక్మి—మంచిచాతుర్యము నేర్చుకొంటిరి. (అనికోపముతో వెళ్లుచున్నది.)

కృ—వసంతకా! యిదంతయు నీవుచేసిన యనర్థకమే!

వసం—అందఱు నన్నను వారే యింతవు నాపైఁ గలిసిరాని దినములు వచ్చినవి.

కృ—వసంతకా! దేవియెట్లు పోవుచున్నదో చూడుము! ఇంక నా మెమందిరమునకేగి ప్రసన్నురాలిం జేసికొందును రమ్ము. [అని వెళ్లుచు] నీవిక్కడనేయుండి శతధన్వుని వృత్తాంతమరయుచుండుము.

వసం—అలాగుననే నీవు పొమ్ము ఇప్పుడిక్కడకు శంబరాసురుఁడు సత్యభామరూపై వచ్చు నాగాఁబోలు నేనీ పొదమాటునఁ బొంచియుండి వానివర్తనము గనిపెట్టెదను.

కృ—అట్లే చేయుము [అని నిష్క్రమించును.]

[పిమ్మట మాయాసత్యభామ ప్రవేశించుచున్నది.]

మాస—నేను శతధన్వుని పుత్రుఁడనైనందులకు నెట్టులైనఁ గృష్ణునివంచించి యతని యొద్దనుండి శ్యమంతకమాణిక్యంబు సంగ్రహించి శతధన్వుచే సత్రాజిత్తున

కిప్పించి యాతనికుమారీమణియగు సత్యభామను శతధన్వునిభార్యగాఁ జేయవల
యును. కృష్ణుఁడింతకు మున్నె మణిసంపాదించి చేతనుంచుకొని సత్యకై యీ
యుద్యానవనమునకువచ్చియే యుండును. ఇప్పుడు నేనుధరించినసత్యభామరూప
ము చక్కఁగా నున్నదిగదా [అనిచూచుకొని] ఛీ! ఛీ! రక్షోవీరశిఖామణినైన
నేను నీచనటకునివలె నిట్లీరూపువహించుట మిక్కిలి నైచ్యముగా నున్నది
సుమీ! ఆ! అట్లన నేల,

గీ. పాలవెల్లి మధించిన ♦ కాలమందు
మోహినీరూపమునుదాల్చి ♦ మోసగించె
నసురకులమును విష్ణుని ♦ యంతవాఁడు
కాన నాకిదియొకతప్పు ♦ లోనిదగునె ?

వసం — ఈరక్కసికుండకొడుకు నిజముగా సత్యభామయున్నట్లే యున్నాఁడుసుమీ
ఓరీ వీనికులుకు పాడయిపోను ? ఇదియెవ్వతె యీలాగు వచ్చుచున్నది.

మంజు — [ప్రవేశించి] భర్తృదారికా! యెక్కడకేగితివే? నీకొఱకై యుద్యానవనమంత
యు వెదకితిని.

మాస — ఇక్కడనే యుంటినే. [స్వగతము] ఇది నన్నునిక్కంపుసత్యభామయని
యె తలంచినది. దీనిపేరు మంజువాణియే కామా [ప్రకాశముగా] మంజువాణీ
గోపాలకృష్ణుఁడక్కడనుండి వెడలిపోయెనా?

మంజు — రుక్మిణియే యతని వెడలించినది.

మాస — [తనలో] ఓహో! రుక్మిణిగూడ మోసపోయినది కాఁబోలు ఇంతకు నేను
నాఁటిన వన్నెవ మాయాలతిక చక్కఁగాఁ జిగిరించినది.

మంజు — భర్తృదారికా! యేమిశే ఆలోచించుచున్నావు ?

వసం — (జనాంతికముగా) ఈతెలివితక్కువముండ మంజువాణి యీరక్కసుని మా
యారూపమునుజూచి భ్రమిసినది ఇంక నానిర్భాగ్యపుశతధన్వుఁడు కృష్ణుఁ
డై వచ్చునుగాఁబోలు మొత్తముమీఁద నిదియంతయు నొక నాటకమువలె ను
న్నది దీనికి నేనేసూత్రధారుఁడను.

మంజు — అదిగో నీ కృష్ణుఁడు మఱల నీకై వచ్చుచున్నాఁడు.

మాస — మంజువాణీ! మనముపోదాము రావే యెవరయినఁ జూచినచోఁ బరిహాసమునకుఁ
బాత్రులమయ్యెదము.

మంజు — ఉండవే అతఁడేమిచేయునో చూతము.

[శ్రీమ్మట మాయాకృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు]

వసం — ఓరీ నిర్భాగ్యుఁడా! శతధన్వుఁడా! కృష్ణవేషము వేసినప్పుడు నీమొగానికెంత తెలివివచ్చినదిరా? కాని నీకర్మమేమిబాగున్నదికాదు. ఇక్కడిసత్యభామ ప్రముక్కడిమానిసుల దిను రక్కసిముఁద నిన్నుగూడ విఱిచికొని తినునులే పద.

మాకృ — ఆహా! (తనలో) కన్యాలలామయగు సత్యభామకై నేనెన్నిపాట్లుపడవలసి వచ్చినది. ఏదియేమైనను,

ఉ. అక్షయకాయసిద్ధిఁగడ ♦ యంగ మమాత్యులు పెద్దకాలము
ప్రాతిరియున్ పడతురియు ♦ ధ్యానముఁజేసి కృశింతురేను స
త్యాతురయుగ్రమంత్రము న ♦ నందితి సత్త్వమకాయసిద్ధి స
ద్వ్రతుణపాత్రమైన ప్రభ ♦ విష్ణుని కృష్ణునిరూపమూనటన్.

మఱియుఁ గామాతురుండనైనను నేనిప్పుడనన్యసామాన్యమయినగౌరవభాగ్యమునే పొందియున్నాను. ఎట్లన,

మ. అరయన్ గానఁ బెద్దకాలమున విమ ♦ తాహారులై యన్యమున్
బఁభాషింపక సత్త్వపోనియుక్తిచే ♦ వర్తించుచు నిష్ఠాగులై
ఋషిశ్రేష్ఠులెందరాని యోగీశ్వ ♦ కృష్ణస్వామిసారూప్యమున్
దరణిలోఁ బొందఁదలఁతురెన్ క్షణముగా ♦ నన్ నేనుగాధన్యుఁడన్.

భగవానుఁడైన కృష్ణుని మహాత్త్వం బెఱింగిన వాఁడనయ్యును నీసత్యపైమోహావేశముచే నాతని నేవఁ జింపఁదలంచితి కాని నీభ్రాంతియెంతెంత యకార్యంబులఁ జేయింపదు?

కాని, యీనారూపముఁ గూర్చి నేనెంతయు గర్వపడవచ్చు ఎందుచేతననఁగా

గీ. ఆ జగములేలు నింద్రుండు ♦ మున్న హల్య
వలఁచి నీచపుఁగోడియై ♦ మెఁగునేను
సత్యకై కృష్ణమూర్తినై ♦ సంచరింతు
నేనె మిక్కిలిమాన్యుఁడ ♦ నింద్రుకంటె.

నేనింక సాత్రాజితి యొద్దకుఁబోయి తత్పాణిగ్రహణమహోత్సవమునుభవించెద. (నడుచుచు నెడమకన్ను దరుట సూచించి) ఏమిది ప్రియతరురాలైన సాత్రాజితిని సమీపించుచుండ నపశకునముగా వామనేత్రస్పందమగుచున్నయది. నాకృష్ణరూపము యథార్థముగానున్నదిగదా (చూచికొని) ఇంక నీయపశకునములు న[illegible]మి చేయఁగలవు. అదిగో నాభాగ్యలక్ష్మియగు సాత్రాజితి తనచెలికత్తియ

యగు మంజువాణితో నేమో మేలమాడుచున్న యది సమయముకాచి యామె సరసకేగెదను.

వస—(తనలో) ఇప్పుడు వీనితోఁ గొంతపరిహాసముచేసెదను. (అనిమాయాకృష్ణుని సమీపించి) కృష్ణా! అదిగో నీమదనసామ్రాజ్యలక్ష్మియగు సాత్రాజితి తొందరగా సమీపింపుము.

మాకృ—(తనలో) ఈవెఱ్ఱిబ్రాహ్మణుఁడు నన్నుఁగృష్ణుఁడనియే తలంచినాఁడు వీనితో మిక్కిలిజాగరూకతతో మెలంగవలయు. వీఁడు నాకడనుండుటయు నొకమేలే. అందువలన సందియమేమియు లేక యాసాత్రాజితి నన్నుఁ గృష్ణునిగాఁ దలఁచును. (ప్రకాశముగా) మిత్రమా! వసంతకా! నీవు నాయొద్దనే యుండి యీమదనతంత్రమంత యునడుపుము.

వస—నడుపుచునే యున్నాను. యింకనునడుపఁగలను.

మాస—మంజువాణీ! నీచేతిలోనిదేమిటే?

మంజు—అది జాజిపూబంతి కొంతసేపు నీతో బంతులాడవలయునని నాకు ముచ్చటగానున్నదే.

మాస—నీముచ్చటను నేనేల భంగముచేయవలయును కానిమ్ము.

(ఇరువురు బంతులాడుచుందురు.)

మాకృ—ఆహా! మిత్రమా! కందుకకేళీలోలయైన యీబాలామణి, తనరూపలీలావిభ్రమముల నామనంబును మఱింత నాకర్షించుచున్నది చూడు,

సీ. మంచుముత్తెపు ద్రావ ♦ రించు తామరపోలె
జెమటచే మోముక ♦ చెన్నుఁ దాల్ప
వలలోని జక్కవ ♦ పులుఁగుజంట వితాన
జనుదోయి పైట సం ♦ దున నటింప
అలరువిల్తునిదాడి ♦ కలరువాద్యములట్లు
కంకణఝుణఝుణ ♦ త్కార మెసఁగ
కలువ రేకుల సూఁగు ♦ నళిపోతములరీతిఁ లాడ
గండయుగముఁ గురుల్ ♦ సిందు
గీ. కీలుగంటూడి పెఱుదుల ♦ వ్రేలుకురుల
వేగనొక కేలవెడమూడి ♦ వేసికొనుచు
అలపుటూర్పులతో బంతు ♦ లాడుచున్న
బోటి నాతిమతిముద్దుల ♦ మూటగట్టు.

వసం — మిత్రమా! నీకొఱకే బ్రహ్మదీనినింత చక్కఁగా సృజించినాఁడు మనము బైటఁబడుటకిదియే సమయము

మా కృ — రమ్ము పోదము [మాయాసత్యభామను సమీపించుచుండఁ బూబంతి తనపైఁ బడును] హా! కామినీమణీ! యెంతదయమాలినపని చేసితివి

చ॥ అసురుసురైతి నిప్పటికే ♦ యంగజుకోల్తలకోలఁ దాంగి! సా
హసమున నీవు వైచికిన ♦ హేయముగా విరిచెండు నాపయిన్
ఇసరితి వే భరించుటకు ♦ నేనలభీష్ముఁడనో త్రిశూలినో
యసితసరోరుహాక్షి! కను ♦ మా నను నీకడగంటిచూపునన్

మా స — మంజువాణీ! యెంతపని జరిగినదే! గోపాలకృష్ణా! నాయవినయంబునకు నన్ను క్షమింపవలయును.

మా కృ — బాలా! క్షమించుటకు నీవుచేసిన తప్పేమున్నది? చూడు,

శా॥ ఏలాజంకెద? నేనునీకతిథినై ♦ యేతెంచితిన్ గావునన్
బాలంబూజయొనర్చి నిప్పితివిన ♦ న్నన్ గావ వక్షోజపా
లీలావణ్యరసంబులంజిలికి క ♦ లీ! తానమాడింపు మే
మోలే నీయధరామృతంబునకె స ♦ మ్మోదించి నేపోయెదన్

వసం — ఈమందభాగ్యుఁడేమి యువ్విళ్ళూరుచున్నాఁడు పాపము వీఁడు యవస్థ జూచిన నాకునొకమూలనుండి నవ్వును నొకమూలనుండి జాలియుఁగలుగుచున్నది.

మా స — మంజువాణీ? మనకుఁ బ్రొద్దయినది పోదము రావే. [వెళ్ళుచుండ]

వసం — చెలికాడా! పోనీకుము.

మా కృ — అళిచికురా! యేమియింత యనాదరణము?

శా॥ ఏమాటాడక చూచిచూడనటులీ ♦ విల్లెక్కచున్నావిదే
మే? మేచర్ధుంబమౌచునీకడకుని ♦ ల్లెతేర మర్యాదగా
సేమంబారయవా? పథశ్రమభవ ♦ త్స్వేదంబుఁ జల్లార్పవా?
మోమోటంబుఁ గామితంబెటిఁగిన ♦ మోమ్మోదంబునన్ దేల్పవా?

వసం — ఓబాలా! సత్యబ్రాహ్మణుఁడనయిన నేనుగూడ నొరుచేసికొని చెప్పుచున్నాను నీవనికోరివచ్చిన యీకృష్ణునకు నీశక్తికి మించకుండ నేదోమర్యాదఁజేసి పంపుటమంచిది. పిదప నీయిష్టము.

మా స—గోపాలా! మీవంటియర్థుల కామితంబు లెఱింగి తీర్చుటకు నే నేపాటి సమర్థురాలను?

మా కృ—సాత్రాజితీ! ఏమట్లు దీనోక్తులు పలుకుచున్నావు? అనన్యకన్యాసామాన్యమైనలావణ్యభాగ్యంబునం దులతూఁగు నీవే మా కోరికలు దీర్పకున్న మాకు మఱెవ్వరుదిక్కు? చూడుము,

మ॥ అలకాధీశుని పెన్నిధానములలో ♦ సజ్జాననుం డేర్చి కుం
తలనీలంబుల నేత్రపద్మముల దం ♦ తశ్రేణికుందమ్ములన్
గళశంఖమ్మును బాదకచ్ఛపములన్ ♦ గైసేసి మావంటి య
ర్థులఁ బ్రోవంగలదానిఁ జేసె దన ♦ నేర్పుం జూపి నీరూపమున్

మా స—పల్లవీపల్లవా! నిన్నుఁ బ్రోవఁగల కాంతానిధానంబులు వేనవేలున్నవి.

వసం—ఎందఱున్న నేమి? నీయంటిదొక్కతయు నీతని కింతదనుక లభింపలేదు.

మా స—అయ్యా! నేనుమాత్ర మెంతపాటిచక్కనిదానను?

మా కృ—బాలా! ఆలాగననకు,

గీ॥ అఁ మహేశున నంతమ ♦ హాశ్వమట్లు
మోఁచె! చక్కఁదనమున ♦ మితియుఁ ధాత
యరయ లేఁడయ్యెఁ గాననే ♦ మాఱలనిన్ను
బోలిన నెంత సృజియింపఁ ♦ జాలఁడయ్యె

మా స—అయ్యా! మీకీయపరిస్తుతప్రశంస యేటికి? యేకాంతమున నున్న పరకాంతా జనమును మీరింత చనవునఁ జులుకనఁ జేసి మాటాడుచున్నారు. ఇది మా గౌరవంబున కెంతయుఁ దగని ప్రవర్తనముగదా.

మా కృ—ప్రియసఖీ! నీవు నాకుఁ జిరపరిచితురాలవే కాని పరకాంత వెట్లవుదువు? చూడుము,

చం॥ నిలిచినఁ గూరుచుండినను ♦ నిద్దురవోయినఁ గల్వరించినన్
బలికిన, బాసినన్ మనము ♦ నన్ సతమే యువతిన్ దలంచి ని
శ్చలపులకాంకురప్రకట ♦ సాత్త్వికచేష్టలతో రమింతునో
యలచెలి వామనోహరివి ♦ యాహృదయేశ్వరివీవు లాతివే?

కావున నాకెంతయు స్వతంత్రురాలవే.

వసం—కామినీ! యింతనమ్రకముగాఁ జెప్పుచున్నప్పుడు నీవీతనినవశ్యము చేపట్టవలసినదే.

మంజు—భర్తృదారికా! నిజమేనమ్మా! ఈతఁడునీకు వరుఁడే కాఁడే

మాస—మంజువాణీ! నిన్నెవ్వరిచ్చట రాయబారములు నడుపుమనలేదు కాని యూరకొమ్మా.

గోకృ—ప్రేయసీ! నిష్కారణముగా మంజువాణిపై నేలకోపగించెదు? దానిరాయబారములతో నేమిపని? చూడు,

చం॥ తడవులనుండి మన్మథుఁడె ♦ తా యిటులీ రాయబారముల్
కడకిటులన్న నీదునసము ♦ ఖ బు కింపె గా, నా నై
నడివితి లోనికోరిక, ♦ నాదమతి [illegible] ట్టం
గడగిన మధ్యవర్తియగు ♦ కామునిఁ జుల్కనఁ జేసినట్టుగ

వసం—ఓకాంతా! మన్మథునితోఁ బాటు నేనుగూడ మీకిరువురకొక మధ్యవర్తినై నామాట నీవుబొత్తుగాఁ దీసివేయరాదు.

మాస—గోపాలా! నేనుకామునిఁ జుల్కఁ చేయుటకాదు కాని నీవునామూలమున నీభార్యలందఱిచేఁ జుల్కనయి పోకుము.

మాకృ—నీ విట్లనుటచే నేనుమఱింత చుల్కనగుచున్నాను

మాస—ఎవరిచేత?

మాకృ గీ॥ తరుణి! నీచేయునీయునా ♦ దరముచేత
ముక్కున నెకోపరసముంచి ♦ ధిక్కరింపు
చెఱకువిలుకాని ప్రోదిరా ♦ చిక్కచేత
నలుకఁగన్నెఱ్ఱసేయుకో ♦ యిలలచేత

మంజు—ప్రాణసఖీ! ఇంతగా బతిమాలుచున్న యీగోపాలదేవుని నీవు నిరాకరించుట మిక్కిలి విరసముగా నున్నదే

మాస—చాలులే నీవు మహాసరసురాలివి దొరికినావు.

మంజు—పోనీ నాకెందుకే నీగొడవ నీవేమైనఁ జేసికొమ్మా నేఁబోయెదను
[నిష్క్రమించును]

వసం—మిత్రమా! నేనుగూడ నిక్కడనున్నచో సిగ్గుచే నీవు బతిమాలినకొలంది నిలుచ

యుండిన కటికబియ్యపు రొట్టెవలె నీబిడ బిగిసికొనిపోవునుకాని నేఁబోయెద నీవుమాత్రి మీమెనెల్లైనఁ దక్కించుకొనుము. వేసారకుము. ఏమన,

ఆ వె॥ కాముకునకు నేమి ♦ గర్భాతురున కేమి
విసుగుసిగ్గు సున్న ♦ బాసఁగిదెంచు
కార్యమైనదాకఁ ♦ గాంతచే దాతచేఁ
ఓట్టులెన్ని యేని ♦ దినవలయును

(వెళ్ళును) వీరొండొరుల నిక్కవంపు రూపములు కనుగొనుదాక నేనిక్కడనుంటినా యారక్కసిముండకొడుకు నన్ను గుటుక్కున మ్రింగివేయును కావున నేఁబోయి మాకృష్ణునకు వీరివార్త యెఱింగించెదను. (నిష్క్రమించును)

మాస—మంజువాణీ! పోకుము నేనును వచ్చుచున్నాను.

మాకృ—(చేయిఁబట్టుకొని) ఓసి కఠినురాలా!

చ॥ సరసతచేత నందనుక ♦ సాగితి మేలిమిలేకపోయె నిం
కి రమరమూలి నీనుమధు ♦ రాధరసారసుధారసంబులన్
స్మరశరతాపదాహమును ♦ మానిచితేల్చినదాక నేనునీ
చరణసరోజముల్ విడువ ♦ చాలరో! మనస్మ్రధునానతప్పిరన్
(కాళ్ళపైఁబడును)

మా స—(తనలో) ఈకృష్ణుని గాటమైనవ్యామోహమున ముంచి నామాయాజాలమునఁ బడవైచితివి. వీనియొద్దనుండి శ్యమంతకము సంగ్రహించుట కిదియే తగినసమయము. మాయలమాఱియైనశంబరాసురుండెంతకుఁజాలఁడు. (ప్రకాశముగా) గోపాలకృష్ణా! అస్వతంత్రురాలనయిన నన్ను నీవింత మోమోటపెట్టిన నేనేమిచేయఁగలను?

మా కృ—నీ వస్వతంత్రురాల వెట్లయితివి?

మాస—మాతండ్రి సమ్మతి నాకు లేదుగనుక

మాకృ—సాహసముయు మీతండ్రి యన్యథాయోజింపఁడే

మాస—శ్యమంతకంబిచ్చిన యెడల

మాకృ—శ్యమంతకంబిచ్చియే తీరవలయునా?

మాస—నీవునన్ను వివాహమాడియే తీరవలయునా?

మాకృ—అవును.

మాస—అలాగైన నిచ్చియే తీరవలయును.

మాకృ—[తనలో] నేను గోపాలకృష్ణుని రూపమునవచ్చినను నీసాత్రాజితి నన్నింకను శ్యమంతకమపేక్షించి యుపేక్షించుచున్నదే. ఇప్పుడేమి చేయను యిట్లని చూచెద, (ప్రకాశముగా)

గీ. వెలఁది! గాంధర్వవిధినన్ను ♦ బెండ్లి యాడి
మొదట నాకోర్కెఁ దీర్పుము ♦ పిదప మణిని
నెచటనుండిన నేగిణి ♦ యించి తెచ్చి
యింతి! నిన్ను బరిగ్రహిం ♦ యింతు నిజము.

మాస—అదియే పనికిరాదు.

మాకృ—(కోపముతో) ఛీ! ఛీ! బ్రతిమాలుచున్న కొలఁది నీవు మఱింత యవినయము చూపుచున్నావు. ఇప్పుడు నీకడ్డము వచ్చువారెవరో చూతము. నిన్నీశతధన్వుఁడు (అపవారించి) ఈకృష్ణుఁడు దక్కించుకొనక మానఁడు. (అని పట్టుకొనును.)

మాస—ఏమిది! శతధన్వుఁడనుచున్నాఁడు. వీఁడు శతధన్వుఁడాయేమి? (ప్రకాశముగా) ధూర్తుఁడా! మణిమాట యటుంచి తొలుత నీవెవ్వఁడవో చెప్పుము?

మాకృ—[తనలో] ప్రమాదవశమున నోరుజారి నాపేరు చెప్పనే చెప్పితినే. ఇప్పుడింకను నావిచారమేల [ప్రకాశముగా] ఓసాత్రాజితీ! నేనెవ్వఁడనైన నీకేమి నిన్ను మాత్రము నేను విడువను.

మాస—అటు గాదు. నీవు కృష్ణుఁడవేయైనచో నేను నిన్ను వివాహమాడను.

మాకృ—ఎందుచేత?

మాస—నాకాతనిపై ననురాగము లేదు.

మాకృ—ఆలాగయిన కృష్ణుఁడను నేనుగాను మఱియెవ్వరిని వివాహమాడుదువు?

మాస—నాకు శతధన్వునిపై ననురాగము మెండు.

మాకృ—[తనలో] తొత్తుకూఁతురు కళావతి యీసాత్రాజితికిఁ గృష్ణునిపైననురాగము కలదని యబద్ధములు చెప్పినదేటికో? ఇప్పుడు నాపేరు చెప్పినయెడల నీమె నన్ను జేపట్టక పోవునా? ఓసాత్రాజితీ! నేను నీకు నిజము చెప్పనా?

మాస—చెప్పుము.

మాకృ—నేను నిజముగా కృష్ణుఁడను కాను.

మాస—మరియెవ్వఁడవు.

మాకృ—నీకెవ్వనిపై ననురాగముగలదో యట్టి శతధన్వుఁడను యింక నన్ను నాదరింపుము.

మాస—అలాగయిన నేను సత్యభామనుకానే.

మాకృ—మఱియెవ్వతవు?

మాస—మరియెవ్వఁడవనుము.

మాకృ—త్వరగా చెప్పుము. ఎవ్వఁడవు?

మాస—నీప్రియమిత్రుఁడను శంబరాసురుఁడను.

మాకృ—అయ్యో! యె తమోసము వాటిల్లినది. మిత్రమా! శంబరా! నీవీసత్యభామా రూపమున నెప్పుడిక్కడకు వచ్చితివి.

మాస—నే నెప్పుడువచ్చిన నేమిగాని నీవింతకు సత్యభామతో మాటాడితివా?

శత—నీతోడనే మాటాడితిని.

శంబ—అయ్యో! మనము ప్రత్యేకపల్లమున మన మోసపడితిమి. ఇది నిక్కముగాఁ గళావతి చేసిన పొరపాటు.

శత—కళావతి యేమిచేయును యింతకు నాయదృష్టమీపాటిగానున్నది. ఇంకను మనకీ పగటివేషములెందుకు? నీమాయవిద్య నుపసంహరింపుము.

శంబ—(అట్లుచేసి) ఆ వచ్చునది కళావతికాఁబోలు.

కళా—(ప్రవేశించి) నేనుచేసిన సహాయమునకు మాశతధన్వుఁడేమి బహుమతి చేయునో అదుగో శంబరునితోఁగూడ నిక్కడనే యున్నాఁడు [సమీపించి] అయ్యా శతధన్వుఁడా! నీవిషయమై నేనెంత శ్రద్ధతోఁ బనిచేసితిని. సత్యభామను నీయొడిలో నుంచితిఁగదా? మఱి నాకానుకమాట చెప్పుము.

శత—ఓసి! రాలగాయా! యేడ్చువానిని మఱింతయేడ్పించుచున్నావు. నీవు నామొగమున పెద్దబండఁ గొట్టితివి.

కళా—ఏమయ్యా! అట్లనుచున్నావు?

శత—ఇదివరకయిన నవ్వుబాట్లు చాలునమ్మా. కృష్ణుఁడెక్కడ నున్నాఁడు?

కళా—ఇప్పుడే శ్యమంతకాన్వేషణమునకయి బయలుదేరి పోవుచున్నాఁడఁట.

శంబ—అట్లయిన మఱియొక యాలోచనము చెప్పెదరమ్మా.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.

---

# సాత్రాజితీయము.

## తృతీయాంకము.

### రంగము—అరణ్యము.

(అంతటఁ గృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

చ. నిలయములున్ బురంబులవ ♦ నీధరదుర్గములున్ నికుంజముల్
కొలఁకులు పక్కణంబులు ని♦గూఢపుఁ డెక్కలిగాండ్రగూడెముల్
గలయఁ జరించివేసరితి ♦ గాని మణిన్ గననైతి రిత్తచే
తులనిటువోయియే మొగముతోఁ ♦ బ్రియురాలినిఁ బల్కరించెదన్.

మరియు

చ. ఎదియెటులైనవచ్చెద సు♦మీ నెలకేయని చేతగాని వ
ట్టిదొరతనంపు నీటు బ్రక♦టించితి నెచ్చెలియొద్ద నేఁటికొ
క్కదినము మాత్రమే కొఱఁత ♦ గాగడువేగెను యెంత వెట్టినో
గద మఱి రెండుమాసముల ♦ కాలము నీనయితిన్ నెలంతకున్.

అయ్యో! ఆకామిని నామీఁదఁగల ప్రేమాధిక్యముచేఁ దన్నుమఱతునేమో యనికదా యీముక్తాహారమును నాకొసంగినది. అట్టి నాప్రాణసఖికి నేనెంత యాశాభంగము గలిగింపవలసివచ్చె. (ముక్తాహారమును జూచి)

క. ముక్తాహారమ! నాకై
ముక్తాహారముగఁ బూవు ♦ బోఁడి కృశించున్
నక్తంచరాదిఖలులు కు
యుక్తిం జెలినేమిజేసి ♦ రోయాలోనన్.

గీ. కాంత! నక్షత్రమాలి ♦ కా! దురంత
పాతకుఁడ నిన్నుఁ జెఱకేడ ♦ బాపినాఁడ
దగ్గఱనెయున్న సకిమే ♦ తాపమందు
గొంతవఱ కేనియుం బంచు ♦ కొందువుగద.

ప్రసేనునిజాడ నీయరణ్యమునంతయు నన్వేషించియే పురంబునకు మఱలెదను. వెటవచ్చిన పరిజనమెంతదూరముననున్నయదియో? (అని నడిచిచూచి) ఎవ్వని దీశవము! పోల్పనైనను వీలులేకుండ కరచరణంబులు నక్కలచే నూడఁబెఱుకంబడినవి ఏమిది! యిచ్చట హేమకంకణము లగపడుచున్నవి ఇవి తప్పక ప్రసేనునివే. అహా! ఇదియేమి చేరువ నొకసింహశవంబు గానుపించుచున్నది. యీ సింహమే ప్రసేనుని వధించియుండునా? ఆలాగైన నీసింహమును వధించిన బలశాలియెవ్వఁడో? ఎట్టయెదుటఁ గనుదీర్ఘమయిన కొండచఱియయొందు నేత్రగోచరమగుచున్నయది. ఆహా! యీపర్వతరాజ మెంతమనోహరముగానున్నది.

గీ. చఱులవెంబడి దొనదొనఁ ♦ జారుచున్న
సన్నసెలయేటితో నొప్పె ♦ శైలరాజు
కరమువెంబడి మదవారి ♦ గురియుచున్న
చండవేదండవిభుతో ♦ సాటియగుచు.

మఱియు

క. ప్రవిమలగైరిక ధాతు
చ్ఛవిచేతఁజిరన్నగన్న ♦ సానుతతుల నీ
యవనీధరము రహించెన్
మివ్వున్ హరిచాపయుక్త ♦ మేఘము వోలెన్.

వెండియు నీకొండనెత్తముల యందందుఁ గాలిబడకలగపడుచున్నవి. యిందెవ్వరుండునో చూచెదను. ఓహో! యిదియొక గుహకాఁబోలును ఇక్కందరం బాటవికచోరుల నునికిపట్టైయుండునా? (ప్రవేశింపఁబోయి) గాఢాంధకారబంధురంబై యీకందరంబు ఘోరవగాహముగానున్నదే!

గీ. ఖలజనుని చిత్తమున్బోలి ♦ ఘనతమఃప్ర
పూర్ణమై రాత్రిచరవార ♦ ములకువసతి

యగుచు లంకాపురంబునఁ ♦ దగినయట్టి
కందరం బేరికిం జెన ♦ కం దరంబు॥

(మెల్లఁగా నడుచుచు) నడిచినకొలంది వెలుతురుగానవచ్చుచున్నయది. ఆహా! యిదియొక దివ్యభవనమువలెనున్నయది ఈకుహరంబున నెవ్వఁడో భాగ్యశాలి కాపురముండనోపు ఇదిగో నిచ్చట నుండి డోలిక వ్రేలాడుచున్నది. ఆహా! యిదియే శ్యమంతకమాణిక్యము (పరిగ్రహించి) ధన్యోస్మి యెవరిది యీవంకకుఁ బరువెత్తుకొని వచ్చుచున్నయది.

(ప్రవేశము దాసి) ఎవరయా నీవు ఇచ్చటిమణియేది? నీవు దొంగవలెనున్నావే. అయ్యో జాంబవంతా! (అని పరుగెత్తును)

కృ—(తనలో) ఈగుహ జాంబవంతునిదా!

[పిమ్మట జాంబవంతుఁడు కోపముతోఁ బ్రవేశించును.]

మ॥ తులువా! యెవ్వఁడ వీవు వేల్పులకు నేఁ ♦ దుస్సాధ్యమైనట్టినా
బిలముం జేరి హరించినాఁడవు మణిన్ ♦ వీరుండవే యైనచో
నిలుమీ యింతట బాటిపోక భయకృ ♦ న్నిర్ఘాతపాతంబుతో
దులతూఁగంగల నాదుముష్టిహతియే ♦ తూలించు నీ ప్రాణముల్

కృ—భల్లూకేశ్వరా!

గీ॥ అడచిపడకుము నీకట్టి ♦ యనదచేతఁ
బడుటకితఁ డంతపాటిదు ♦ ర్బలుఁడు గాఁడు
పరధనంబు హరించిన ♦ పాపకర్మ!
నిలుము నీప్రాణధనముల ♦ నే హరింతు

జాంబ—మాతో నిర్భయముగా మాటాడుచున్నాఁడవు నీ వెవఁడవురా? పరధనమా పరధనమేమి! స్వధనమేమి?

మ॥ ధనరాజ్యంబులు బాహువిక్రమబలా ♦ ధారంబులై యుండునో
క్రూని చెంతన్ స్థిరతన్ వసింపవవి సం ♦ గ్రామంబునన్ భద్రమౌ
వ్వనిదో వానివి నీవినావ నెడుము ♦ భ్రాంతిన్ బడన్ బోకుమీ
యనిలో నన్ను జయించితేని మణి నీ ♦ దౌరము మ్రచేనై నచోన్.

కృ—ఏమిరా! చోరశిఖామణీ! నీచోరశాస్త్రపాండిత్యమంతయు నీకృష్ణునియొద్ద వెల్లడించుచుంటివి.

జాంబ—ఓహో! కృష్ణుఁడనన నీవేనా! అందులకేనను చోరశిఖామణియని దూషించితివి కాని,

కం॥ ఏదీ వ్రేపల్లెసురా
పోదము మనరిత్తవాద ♦ ములతో నేమీ?
నాదొంగతన మదేదో
నీవారలన మేదాయచట ♦ నిర్ణయమగుఁగా

ఉ॥ గోపసతీమనోధనము ♦ గొల్లఁగఁ గొట్టితినో? తదీయపుం
గంపురముల్ హరించితినొ ♦ కమ్మని వెన్నలజారలాడి? యే
దీ పరికించి తెల్పుమొక ♦ టేనియు నామెడఁగానిచొప్పవా
యోపిన యట్టులాడిన జ ♦ నౌఘము మెచ్చునె? నమ్మవచ్చునే?

కృ—భల్లూకపతీ! చాలు నీవాచాలత్వము అవక్రంబులగు మాలీలావిక్రమంబులు మృగప్రాయుఁడవైన నీవే మెఱుంగుదువు.

జాంబ—నేనెంత మృగప్రాయుఁడనయినను నీవిక్రమంబుల నెఱుంగక పోలేను. వినుము.

సీ॥ అడలుచుండఁగఁ బట్టి ♦ యానుదాని వధించి
ప్రబలినాఁడవుగదా ♦ బాహుశక్తి
చదపుర్వు చేఁబుచ్చు ♦ శకటము విదళించి
వివరించితివిగదా ♦ విక్రమంబు
చిఱుకమీలనుమ్రిఁగు ♦ చీకుఁగొంగను జంపి
చాటినాఁడవుగదా ♦ శౌర్యపటిమ
కసవు మెసవుఁ బట్టి ♦ మానలియెద్దును జంపి
యెసఁగినాఁడవుగదా ♦ లసితకీర్తి
గీ॥ గొల్లయిల్లాండ్రయిండ్లలోఁ ♦ గొల్లఁగాను
బాలు పెరువును దార్వి త ♦ ద్భాండములను
బగులఁగొట్టిన సద్భుజా ♦ బలుఁడవీవు
నిన్నెఱుంగక పోలేను ♦ వెన్నదొంగ!

కృ—ఓరీ పరనిందాపరాయణా!

కం॥ చీమలదోమలఁ బీల్చెడు
నీమగటిమిమాత్రమేమి ♦ నెగడినదోరీ
వేమాటలేల? పద రణ
భూమికి నదెనిర్ణయించుఁ ♦ బో మనబలముల్.

జాంబ—ఓరీకృష్ణా! మాటిమాటికి యుద్ధము యుద్ధమని మాటిమాటికనుచున్నావు. యుద్ధమన నేమని నీతలంపు?

సీ॥ గొల్లయిల్లాండ్రతో ♦ సల్లాపములుగావు
సమరక్రియాప్రసం ♦ గములుగాని
తరుణాంగుళీన్యాస ♦ మురళీరవముగాదు
సమదోగ్రసింహనా ♦ దములుగాని
చెలువుఁజెక్కుళ్ళపై ♦ నెలవంకలిపిగావు
తనువుసించెడు బాణ ♦ తతులుగాని
మెసవగాఁగడుపార ♦ మిసిమిముద్దలుగావు
నిష్ఠురంబగుముష్టి ♦ నిహతిగాని
గీ॥ కోమరుటావుల యంభార ♦ వములుగావు
సమదమాతంగబృంహిత ♦ చ్ఛటలుగాని
బాలికాపాళికాజల ♦ కేళిగాదు
వాలుగండ్రండ్రతో రణ ♦ కేళిగాని

కృ—ఓవృద్ధభల్లూకమా!
ఆ॥ అవయవంబులెల్ల ♦ నవసి నెమ్మేనిలో
సంధిబంధములును ♦ సడలిపోయి
వయసు సచ్చెగాని ♦ వాజ్మాత్రశౌర్యమ్మ
చావదింక మెచ్చఁ ♦ జనుముని న్ను॥

జాంబ—కృష్ణా! యేమన్నావు? వాదివాఙ్మాత్రశౌర్యమా! భుజశౌర్యముకాదేమి?
శా॥ ముష్టాముష్టిగ నీవునేనుగుటిగాఁ ♦ బోరాడుచో విక్రమా
వష్టంభంబునఁ బట్టినీమచరణ ♦ ద్వంద్వంబు చక్రిక్రిక్రి యుక్త

బుష్టిన్ గిట్టునఁ ద్రిప్పి రాతను శిరం ♦ బున్ గొట్టుచో నీకు వి
స్పష్టంబౌ భుజశౌర్యమో మఱి వచ ♦ శ్శౌర్యంబొ నాదారయన్॥

కృ—జాంబవంతా! అప్పుడు నీ భుజశౌర్యము లోకులు మెచ్చక పోరు

జాంబ—మూర్ఖా! ఒకరు మెచ్చవలసిన పనియేమున్నది?

శా॥ రక్షస్సైన్యముఁ జొచ్చి మున్ను భుజద ♦ ర్పంబేర్పడన్ గాళ్లతో
విక్షేపించుచుఁ జేతులన్ జరచుచున్ ♦ వీరావళిన్ దున్నుచో
సాక్షాద్విష్ణుఁడు రాముఁడే నను భళీ! ♦ శాబాసనెన్ నీవున
న్నాక్షేపించిన నేమి? మెచ్చిననునే ♦ మౌ? వల్లవీపల్లవా!

కృ—ఆక్షేపించుటకుఁగాని మెచ్చుటకుగాని యిప్పుడెల్లవీలగు సంగర రంగంబున మనయిరువుర భుజబలంబుల తారతమ్యంబులఁ బరిశీలించినప్పుడుగదా?

జాంబ—అట్లయిన నిప్పుడే యుద్ధభూమికి నడువుము. (అని చేయిఁబట్టిలాగికొనిపోవును)

(పిమ్మట మందపాలుఁడు ప్రవేశించును)

అక్కటా! యిల్లు వెడలినప్పుడు తప్ప కృష్ణుని జాడయే నేఁ జూడనైతి. యీగుహలో నుండి కృష్ణుని కంఠస్వరము మాత్రము వినఁబడుచున్నదిగాని పోయి చూచెదనన్న నావంటి వాఁడొంటిగాఁ బోవఁదగినది కాదు. ఈ సమాచారము పురంబులోని పెద్దలకెఱింగింతును. (అని నిష్క్రమించును)

(పిమ్మట కృష్ణజాంబవంతులు ప్రవేశింతురు)

జాంబ—కృష్ణా! ఇంక యుద్ధప్రక్రియ చాలును,

శా॥ విద్వేషంబుఁ జేసి యింతదనుకన్ ♦ వెన్నాడి పోరాడ న
స్మద్వీర్యంబడుగంటె నోడితి జయిం ♦ పన్ జాలనిన్నింక సా
క్షాద్విష్ణుండవు నీవు కానియెడఁ దాఁ ♦ కన్ జాలునన్నేఁడు? పా
దద్వంద్వంబుల వ్రాలినాఁడ నికనా ♦ దౌరాత్మ్యమున్ సైఁపుమా॥

కృ—జాంబవంతా! మనభుజబలంబుల తారతమ్యంబిప్పటికైన నీకు బోధపడినదా?

జాంబ—స్వామీ! చక్కఁగా బోధపడినది

సీ॥ భువనసంతతి సృజిం ♦ చువిరించి యెవ్వాని
బొడ్డు కెందామర ♦ పురుటిపాప

సిరులిచ్చిరక్షించు ♦ తరళాక్షి యెవ్వాని
పేరురంబున కర ♦ విందమాల
విశ్వపావనమై ♦ వినువాక యెవ్వాని
యడుగుఁదామరలోని ♦ యలరుఁదేనె
భూభారము వహించు ♦ భోగీంద్రుఁ డెవ్వాని
పడక కేర్పడినట్టి ♦ పట్టుపాన్పు
గీ॥ సురల నెదిరించి వేల్పుటో ♦ గిరము గొన్న
పక్షిరాయఁ డెవ్వానికి ♦ నెక్కిరింత
విశ్వమయుఁడవైన యామహా ♦ విష్ణువీవ
దేవదేవ! యనంతకీ ♦ ర్తిప్రభావ!

మ॥ మనువంశంబున భూభరంబుదొలఁగిం ♦ పంబుట్టి, ధర్మప్రవ
ర్ధనకీర్తిన్ ధరణీసుతన్ గొని, సుమి ♦ త్రాపుత్రుతోఁ గానకున్
జనకాజ్ఞన్ గొనియేగుదెంచి, ఖరర ♦ క్షస్సంఘమున్ దున్మి మా
కనుకూలించిన రాఘవేంద్ర! గుణసాం ♦ ద్రా! నిన్ను ధ్యానించెదన్

శా॥ సుగ్రీవప్రముఖుల్ బలీముఖులు నీ ♦ చుట్టన్ సమ్మోదంబునే
కగ్రీవమ్ముగ నాడినన్ గృపణర ♦ క్షాదీక్షఁ జాటింప భీ
త్రిగ్రస్తుండగు వైరితమ్ము శరణా ♦ ర్థిం బ్రోచు విస్ఫారణ
వ్యగ్రామగ్రహధీర రాఘవపర ♦ బ్రహ్మంబు నన్నేలుతన్

మ॥ అరుణాంభోజవిలోకనోగ్రమును బ ♦ త్యాలీఢపాదంబు రౌ
ద్రరసావేశమహాట్టహాసవికటో ♦ గ్రభ్రూలతాబంధన
త్వరితంబున్, దశకంఠలుంఠనపటు ♦ బ్రహ్మాస్త్రసంధాన ధూ
ర్ధరయోధాయితవీరరాఘవపర ♦ బ్రహ్మంబు నన్నేలుతన్

[అని నమస్కరించి]

పురాణపురుషా! లీలామానుష విగ్రహుండవైన నిన్ను దొంత సాక్షాద్విష్ణువని యెఱుంగక గర్వాతిరేకంబున నపరాధం బొనర్చినందులకు నన్ను క్షమింపవలయును.

ఇదిగో మణితోఁగూడ నాకుమారీమణియైన జాంబవతినిగూడ నీకుసమర్పించుచున్నాఁడను పరిగ్రహించి నన్ననుగ్రహింపవలయును.

కృ—భల్లూకపతీ! సఖ్యమే గాక నేఁటినుండియుఁ జుట్టరికముగూడ లభించినందులకు సంతోషించితిని.

గీ॥ ధీరమతివీవు రామావ ♦ తారమందు
గపులతోఁ బాటు నాచెలి ♦ కాఁడవైతి
శౌరి యిప్పుడు కృష్ణావ ♦ తారమందు
గన్యయనొసంగి నామామ ♦ గారివైతి॥

మామా! నన్నొక్కమారు గట్టిగాఁ గౌఁగిలించుకొనుము. నీశరీరంబిప్పుడు వజ్రశరీరంబయ్యెను. మణితోడను నీకుమారీమణితోడను బ్రయాణమయ్యెదను. నాకు సెలవిమ్ము.

[ఆకాశమున] కృష్ణా! నేను దేవదూతనగు గంధర్వుఁడను క్రూరుండగు నరకాసురుండమరావతీపట్టణమెల్ల ముట్టడివేసి పూజ్యులగు శచీబిడౌజులం జెఱఁబెట్టి చిరకాలసుప్తంబగు నమృతకుంభముఁగొని యిదెపోవుచున్నాఁడు. దీనజనబాంధవుఁడవగు నీవు దేవకార్యమున సప్రయత్నుఁడవై వర్తించినంగాని సుధాకుంభము దక్కనేరదు దేవా! త్వరపడుము త్వరపడుము.

కృ—(తనలో) నేనిప్పుడేమి చేయుదు? ప్రియురాలగు సాత్రాజితికి నేఁడేవగవు గడచిపోయినదికదా. నాకై యాకామినియెంత పరితపించుచున్నదో? ఏది యెట్లయినను దేవకార్యమనివార్యము. పరోపకారార్థము స్వార్థత్యాగమొనరించినవాఁడేకదా ధన్యతముఁడు (ప్రకాశముగా) దేవదూతవగునో గంధర్వా! ఇదిగో నేనువచ్చుచున్నాఁడ మీరిఁక జడియకుఁడు. మామా! నేను తిరిగి కొలఁదినాళ్ళకే వచ్చి నీకుమారిం గొనిపోవుదు. ఆలస్యమయ్యెనేని నీవ మాపురంబునకు నీసుతం దోడ్కొనిరమ్ము. సెలవుగైకొనెద.

జాంబ—కృష్ణా! మఱతువుసుమీ

కృ—ఎన్నటికట్లు తలంపకుము (నిష్క్రమించును)

జాంబ—నేఁడుగదా నాజన్మము సార్థకంబయ్యె (నిష్క్రమించును)

♦ఇది తృతీయాంకము♦

# సాత్రాజితీయము

## చతుర్థాంకము.

[మంజువాణి పూలపుట్టికతోఁ బ్రవేశించుచున్నది.]

"మంజువాణీ! నేఁడు సాయంకాలము నామనోనాథునకు శుభంబుగా దుర్గాపూజ నిర్వర్తింపవలయు నీవుద్యానవనమున కేగి మందారవకుళచాంపేయాదికుసుమంబులఁ గొని కళావతితోఁగూడ సత్వరముగ రమ్ము" అని భర్తృదారిక చెప్పినది కదా నేను త్వరపడవలయు, కాని యిప్పుడు కళావతి నెక్కడ వెదకుదును. ఎందులకో యెప్పుడాపాడు శతధన్వునితో దానికి గుసగుసలు. ఏమైన నేడ్చికొననిమ్ము నాకేమి నేను నాపనిమీఁద బోవుదును.

(కళావతి యావలప్రక్కనుండి ప్రవేశించి)

ఏమే మంజువాణీ! ఎదుటనున్న నన్నుఁజూచి మాటాడకయే పరువెత్తుచున్నావు. ఇంతలోనే యైశ్వర్యము వచ్చినదఁటే?

మంజు — నాకేమియైశ్వర్యము రాలేదే పనితొందరమీఁదఁబోవుచు నిన్నుఁజూడనయితిని.

కళా — అంత పనితొందరగ యేమివచ్చినది?

మంజు — నేఁడు సాయంకాలము దుర్గాపూజకై పూలఁదెమ్మని భర్తృదారిక చెప్పఁగా నుద్యానవనమున కేగుచుంటిని. నిన్ను బిలుచుకొని రమ్మని చెప్పినది. అదృష్టవశమున వెదకనక్కరలేకుండ నిక్కడనే దొరకితివి పోవుదమురా?

కళా — (స్వ) ఓహో! కృష్ణసమాగమునకై కాఁబోలు నిప్పుడీ దుర్గాపూజ. ఈవిషయమా శతధన్వుని కెఱిఁగించిన నతఁడేదియైన నుపాయముచే నీపెను దక్కించుకొనునేమో. (ప్రకాశముగా) మంజువాణీ! నీవు పోయిరమ్ము. నే నిప్పుడే మిమ్ముఁ గలిసికొనియెదను.

[ఇరువురు నిష్క్రమింతురు]

(ఇది ప్రవేశకము)

[అనంతరమున సాత్రాజితి మంజువాణితోఁ బ్రవేశించుచున్నది.]

సాత్రా — మంజువాణీ! దుర్గాలయమునకు దారిదీయవే.

మంజు — భర్తృదారికా! ఇటు యిటు.

సాత్రా — ఏమే! నేఁటిదినము గూడ గడచినట్లేకదా? ప్రియుఁ డింకేమివచ్చునే?

శా॥ లలనా! యెక్కడనున్నవాఁడొ ప్రియుఁడే ♦ లారాఁడొ? యెందేని యున్
గలయందిప్పురి వేసటన్ మనికినై ♦ గాసిల్లెనో లేనిచోఁ
బాలయల్కంబచరించి నాధునివసం ♦ బున్ దిప్పెనో భైమి, హా
కలకాలంబిటు చింతతో జరుగునా ♦ ఖ్యాఁ బెన్నఁడే నాకిఁకన్?

మంజు — నెచ్చెలీ! అధైర్యపడకు నీపై వలపులేక యతఁడింతకాలము మసలలేదు. కాని మఱేదియో యొకానొక బలవత్కారణమున నతనికి రాను దీరిక లేకుండ వచ్చునని నే నూహించెదను.

సాత్రా — మంజువాణీ! నీవును నావలె పట్టివెట్టిబాగులదానవేసుమీ. కుడుము చేతికిచ్చిన పండుగయని యబ్బుదువు. ఇంతకు నేనెంత పరిహాసపాత్రురాలనైతినే!

ఉ॥ అక్కట! బేలనై వలపు ♦ లాఁడివో వెలియైతిఁగాక, నా
దిక్కునకాతఁడేటికిరు ♦ డెంచు? మణింగణియింపవానికే
మక్కఱ? యింతగా మసలు ♦ నావలపున్న ప్రియుండు? బాగుబా
గొక్కతె కాఫురంబునకు ♦ నవ్విభులూరిన దక్కనేర్చునే?

మంజు — నెచ్చెలీ! నీతో నాఁడంతయనురాగమున మాటాడి మణినెట్టులైన గణియించి తెత్తునని పెక్కుబాసలిచ్చి ముక్తాహారమును వలపుగానుకగాఁ బరిగ్రహించి యేగినవాఁడు నిన్ను మఱచునటే?

సాత్రా — అక్కటా! ముక్తాహారపుమాట స్మరణకుఁ దెచ్చి నా మనస్సును మఱింత కలఁత పఱచితివిగదా. (ముక్తాహారము నుద్దేశించి)

మ॥ తరుణీ! నీవెయదృష్టశాలినివి ము ♦ క్తామాలికా! గోపికా
వరశృంగారగళోపగూహనముఁ గ ♦ భ్భాసిల్లి హైమాంబుజశ్రీ
కరగంధాముల నస్మదీయతనువో ♦ గ్రాంతసంతాపదు
ర్భరమున్ బాసి కృతార్థతన్ గుణవతీ ♦ ప్రామాఖ్యముం గాంచితో॥

మంజు — నెచ్చెలీ! ఊరడిల్లుమూరడిల్లుము

సాత్రా — ప్రాణసఖీ! నా కూరటజనించు టెట్లు. ఈయుద్యానమున నెక్కడఁజూచినను ప్రాణిలోకమెంతసంతోషమునఁ దమజీవయాత్ర గడుపుచున్నదో చూడుము.

సీ. వెలిదమ్మిమొగడమొదం ♦ బెనవైచికొని కన్ను
లరమోడ్చి శుకనికేతం ♦ బంచదోయి
మావిలేజిగురుంద ♦ మ్మలమొండొరులనోళ్లఁ
గలిపి సేవించుకో ♦ యిలలజంట
బొందువల్లియుపల్లె ♦ మునయుండు జతగూడి
తేనెమోగిరమాను ♦ తేంటిజోడు
కులుకుటొయ్యారంపుఁ ♦ బలుకులఁ నడకలఁ
సొంపారుపావురా ♦ దంపతులును ॥

గీ॥ ప్రకృతిలోనింకఁ గన్పడు ♦ ప్రాణులెల్ల
ననఘదాంపత్యసౌఖ్యంబు ♦ లందుచుండ
నకటకట! నాకు నా సౌఖ్య ♦ మనెడుమాట
దూరమైపోయెఁ గదసర ♦ సీరుహాక్షి!

మంజు — ప్రాణసఖీ! నీకు సౌఖ్యపుమాట దూరముకాలేదు కడుఁ గడుఁ జేరువయే యగుచున్నది.

సాత్రా — చెలీ! ఇదేమిమాట? నాప్రియుఁడు కృష్ణాంతకమునకై యేగి యొక వత్సరము కంటె నెక్కుడు కాలేదఁటే?

మంజు — ఎక్కడిదే? ప్రియవిరహమునఁ గాలము నీకట్లు దుస్సహముగాఁ దోఁచుచున్న దికాని గడువుగడిచి వారముదినములకంటె నెక్కుడు కాలేదు.

సాత్రా — అక్కటా! గడువు గడిచియేపోయెనుగా! ఇంక నే నేమని జీవింతునే?

చ॥ గడువను తెప్పనూది మునుఁ ♦ గింబడ కీవిరహాబ్ధి నాసతో
గడచెదనంచు నింతదనుఁ ♦ గల్గెడు నీదితి నింక నిప్పుడో
పడతి! గతించె నాసయు; న ♦ భంగురభంగవిగాఢ్యమైన నా
గడువను తెప్పయుం జెడితిఁ ♦ గా కడియాసనుతోడ నేఁడుఁ గల్ ॥

కావున,

మ॥ మనసా! యాసలఁ బెంచికొంచుఁ దపియుం ♦ బంగోకుమి కేలి చే
మని మోహించితి బైసిమాలి బహుకాం ♦ తాధీనుఁ డౌవానిసుం
త నిజంబౌ నభిజాత గౌరవమెయు ♦ న్నట్టి సీకు వైరాగ్యము
న్నొనియాకృష్ణునియందె కాదఖిలమం ♦ దుం నిస్పృహం జెందుమా॥

మంజు — భగవానుఁడైన కృష్ణునియందుఁగూడ నిస్పృహవైనచో నీవైరాగ్యమునకు ఫలమేమున్నది.

సాత్రా — పేరాసనుండిమాత్రము పొందుచున్న ఫలమేమి చెప్పుము? అదిగాక స్వీయకాంతాభోగ్యుఁడైనవాఁడు నాకెట్లు భోగ్యుఁడగును?

మంజు — నెచ్చెలీ! నీవూరక హతాశురాలవుగాకుము. నేనిప్పుడకృష్ణునిమందిరంబున కేఁగి సమయోచితములైనవాక్యముల నాతని మనసుఁ గఱఁగించి నావెంటఁ దోడ్కొని వత్తును ఇంతలో నీవు దుర్గాపూజ నిర్వర్తింపుము.

సాత్రా — ఓసి వెఱ్ఱిదానా! నీవేమికృష్ణుని దోడ్తెచ్చుటేమి! ఎంతయునాలోచనముగఁ బల్కితివే? చూడు.

మ॥ సుమబాణంబులఁబోని నెచ్చెలులతో ♦ శుద్ధాంత కేళీవిలా
సముం దేలెడువానిఁ జూచుట తట ♦ స్థంబౌనె? నీకయ్యోనే
ని మదీయంబగు నీయవస్థ నెటువి ♦ న్పింపంగ సాధ్యంబగుల్
రమణీకోటి కెఱుంగకుండ? వలదీ ♦ ప్రారంభముల్ వ్యర్థమా

మంజు — నెచ్చెలీ! ఇంతయేందుకు? నేను సమయమెఱిఁగి కృష్ణునిం గాంచి నీకతనినుండి ప్రత్యుత్తరముఁ దెచ్చినప్పుడు నన్ను "మంజువాణీ" యని పిలువుము.

సాత్రా — మంజువాణీ! నీయిప్పటిపల్కులను నమృతపుఁ జినుకులచే నాయాశాలతిక మాఱాకువేయుచున్నది. కావున నిప్పుడె యాకృష్ణునిమందిరమునకేఁగి నయవినయముల నాతనిమనంబుగఱఁగించి యిట్లనుము. "కృష్ణా! నాఁడంతయనురాగమున మాచెలిఁ బలుకరించి మఱలమొగమైనఁ జూపకుండుట నీయిట్టిరసికునికు దగునపనిగా? అయ్యో! మాసాత్రాజితి యవస్థయేమని నీకువక్కాణింతును" అని మఱియు నిట్లనుము.

సీ॥ ఎలదోఁటలోనాఁడు ♦ దిలకించుటే మొదల్
కన్నారనిద్దుర ♦ గాంచదనుము
ఎవరేమిచెప్పిన ♦ యువిద నిక్కౌక
యితరునెవ్వని వరి ♦ యింపదనుము
సుదతి నీరాకకై ♦ యెదురుఁజూచుచునుండి
క్షణము యుగంబుగా ♦ గడపుమనుము
మదనాతపమ్ముచేత ♦ మఱుఁగుమైదీవతో
నలివ యిప్పుడు సగ ♦ మయ్యెననుము

గీ. ఒడలుమాత్రంబె చెలిచెంత ♦ నుండెననుము
చిత్తమంతయు నీయుందె ♦ హత్తెననుము
వలపులేకున్నఁ గబ్బురైన ♦ బంపుమనుము
బ్రదికియున్నదిదానికే ♦ పడఁతి యనుము.

మంజు — ఇఁకఁజాలును; నేను పోయివత్తు.

సాత్రా — పోయిరమ్ము. నీకు దారిలో శుభశకునము లయ్యెడుఁగాక. మఱల దుర్గాలయమున నన్నుఁ గలిసికొనుము.

మంజు — ఆలాగే. (పోవుచుండ)

సాత్రా — (మంజువాణింబిలిచి) నెచ్చెలీ! సరసాగ్రేసరుఁడగు కృష్ణునితో నీవు సమయమెఱుంగక మాటాడెదవుసుమీ !

మ. కనిపెట్టందగు నాథుమోముఁగనియే ♦ కార్యాంతరాసక్తుఁడుం
డెనో కోపంబుననుండెనోయతని నిం ♦ తీ ! యంతనెవ్వారలున్
వినకుండన్ జెవిలోన నంతయు రసా ♦ విర్భూతి, శీఘ్రంబుగా
వినిపింపందగు నాయపస్థ బతికిన్ ♦ విజ్ఞప్తిమూలంబుగన్.

మంజు — అయ్యో ! నాకిన్ని చెప్పవలయునటే !

సాత్రా — నీకన్నియుందెలిసియున్నను నాయపేక్షచేనింత చెప్పితి. కోపింపకుము. పోయిరమ్ము. నేనొక్కఁతె నిక్కడనుండునని సందేహింపకుము. కళావతియిప్పుడే వచ్చును.

మంజు — (నిష్క్రమించును.)

సాత్రా — (స్వగతము) మంజువాణి తెలివితక్కువదిమాత్రముకాదు. కార్యము సాధింపనేవచ్చును. ఈమీఁది ప్రేమచేనిక్కడియంజ నక్కడకువేసి యీపాటికప్పుడే కృష్ణుని మందిరముఁ బ్రవేశించియే యుండును కాని, నేనెంత తెలివితక్కువ పనిచేసితిని !

గీ. పోలఁతి యటకేగి యేమేమి ♦ పలుకఁగలదొ
చెలియపలుకుల కతఁడేమి ♦ దలఁచునొక్కొ
వలపుగలిగిన నతఁడె రా ♦ వలయుఁగాక
పిలువఁబంచినఁ జులుకన ♦ సలుపఁడొక్కొ.

ఏమో యెట్లుకానున్నదో భారమంతయు మాతల్లిదుర్గపైనిడి దేవి కొలువఁబోయెదను.

(పరిక్రమించును.)

[పిమ్మట నొకమూలనుండి కళావతి శంబరాసుర శతధన్వులతోఁ బ్రవేశించును.]

కళా— (దూరమునుండి సాత్రాజితింజూపుచు) శతధన్వుఁడుగారూ! అదిగో నీవలపు లదీవి సాత్రాజితి. ఇప్పుడామెయొంటరిగా దుర్గాలయము సమీపించుచున్నది. ఇప్పుడైన మెలఁకువతో నామెను దక్కించుకొనుము. వెనుకటివలెఁ దెలివి తక్కువగానుండి తెల్లమొగముతో నాకడకువచ్చి నన్నుదూరవలదు. ఇంతకంటె నీకు మంచిసమయము చిక్కదు. ఎట్లు దానినిస్వాధీనము గావించుకొందువో ఇదిగో నావలన నేరములేకుండ నీకామెను నొంటరిగా నగపఱచితిని. వేఱుపోయినత్తును నేనిక్కడనున్నయెడల నన్నుసందేహించును. కార్యాంతరమున నాబహుమతికిమాత్రము పంగనామముసేయకుము.

శత— సరే పొమ్ము (అని శంబరుంజూచి) మిత్రమా! శంబరా! ఇప్పుడేయుపాయమున నాకీయొప్పులకుప్ప నప్పగించెదవు?

శా. ఈరామామణి, యావిలాసవతి న ♦ న్నేకోరి పెండ్లాడినన్
స్వారాజ్యంబదియేల? దివ్యముల లం ♦ చాలిచ్చి మేనాఘృతా
చీరంభాహరిణీముఖత్రిదశసూ ♦ స్త్రీరత్నముల్ నన్నుఁదా
రై రమ్మన్న నిసీ! యటంచవలమో ♦ మైధీరతం బోవనే.

శంబ— మిత్రమా! శతధన్వీ! ఊరక యుబ్బులబాటె యేమిప్రయోజనము? సమ్ముఖంబునకువచ్చి రాయబారములుసల్పనేల? నీవాచాచమత్కృతిఁజూపి యాకన్యాలలామమనంబుజూడ నారయుము.

శత— దీనిమనముజూడ నిప్పుడారయుట యేమి? ఇదివరకెంతయో ప్రయత్నము సల్పితిని. దీనికి నాపొడయన్న నే గిట్టదుగదా. అందుచేత నే,

మ. ఎలసిగ్గుంగొని కాదు గ్నొనదు క ♦ న్నెయెత్తి పేకీసున
న్బొలయల్కన్ వహియించికాదు పెడమో ♦ మ్ముంబెట్టురోషంబునన్
పొలుపుంజూపులఁగాదు, చూచు విరసం ♦ పుంజూపులన్ నన్నునీ
లలనారత్నము గ్రీనెట్లు సరసా ♦ లాపంబులం దేల్చెదన్?

మఱియు,

శా. నాయందెప్పుడు మాఱుమోము నిడు క ♦ న్యారత్నమిద్దాని మో
హాయత్తుండను పల్కరింపఁగదు హా ♦ స్వాయత్తమా నేదియో

మా యోపాయమువన్ను దీనిగ్రహియిం ♦ పం జెల్లునేకాని యీ
యాయత్నంబులఁ జెంత కేఁగగదు నే ♦ హ్యాంబుజ రసాభాసమా.

కావున నేయుపాయమున దీనిసంగ్రహించెదనో? మిత్రమా! నీవియేభారము.

శంబ— అట్లయిన దేవింగుఱించి యీమె కావించు ప్రార్థనముచే నీమెమనంబెవ్వరి యందున్నదో స్పష్టముగాఁ దెలిసికొనవచ్చును. నేనుపోయి గర్భాలయమున దేవికి వెనుకగా నొదిగియుండి యిప్పుడొకపద్యమ్ము గడఁ బన్నెదను. నీవీమెకుఁ గనఁబడకుండ నీపొదయందొదిఁగియుండుము.

శత— నీవెట్లు చెప్పినట్లాచరించెదను. (పొదయందు డాఁగును)

శంబ— (దేవికి వెనుక నొదిగియుండును.)

సాత్రా— (దేవికభిముఖముగా నిలిచి ప్రాంజలియై)

దేవీ! విశ్వజననీ! కొండొకకార్యసిద్ధికై నీపదాబ్జముల నాశ్రయించితి. దుర్లభజనానురక్తనైన నన్ను విఫలమనోరథంజేయక విరహాబ్ధిదరిఁజేర్పనీవే యొకనావవై నన్ను రక్షింపుము. జంగమస్థావర విశిష్టంబగు జగజ్జాలంబునకెల్ల సాక్షీభూతవగు నీకు నామనోరథంబేదియో తెలియకున్నదే తల్లీ! మఱియు,

గీ॥ ఆరయ సర్వజ్ఞురాలగి ♦ వైననిన్ను
నేనెఱింగింపనేల నా ♦ యింగితంబు?
ఆరయనెఱుగున న్నాకుయ్యి ♦ నాలకించి
యూరడింపు మభీష్టవ ♦ రోదబ్ధి.

దుర్గ— వత్సా! సాత్రాజితీ! నీయభీష్టము మిక్కిలిగౌరవాస్పదముగానున్నది. మేమిది వఱకే నీయింగితమెఱిఁగియున్నారము. కాని నీవందరానిమ్రానికఱ్ఱుసాచినావు కేవలము విధికింబ్రతికూలమగునీకోరిక దుర్లభము సుమీ!

సాత్రా— హా! కృష్ణా! నేను నీకిల్లాలనై నీకుంబరిచర్య యొనరించుట విధికే ప్రతికూలమై పోయెనుగా హా! హతవిధీ! (అనిమూర్ఛిల్లును)

దుర్గ— బిడ్డా! దుఃఖించినప్రయోజనము లేదు. వేయిమాటలేటికి నీకీజన్మమున శతధన్వుడే పెనిమిటి కాఁదగినట్లు విధిచే నిర్ణీతమై యున్నది.

సాత్రా— అయ్యో! అయ్యో! శతధన్వుఁడేనా నాకీజన్మమున! అలాగైనఁ బ్రాణపరిత్యాగ మొనరించుకొననేనేల జాగొనరింపవలయు?

దుర్గ— బిడ్డా! నీపూరక సాహసకర్మంబులందిగకుము. శతధన్వియైనను కులశీలవయోరూపములఁ గొంతతపడినవాఁడుకాఁడు.

సాత్రా—తల్లీ! నీవుకూడ నాపాలి శతధన్వి పక్షమే యంగీకరించితివా? ఆర్తత్రాణ పరాయణవైన నీచేతగూడ నిట్లు పరాభవింపఁబడి దురాత్ముఁడగు శతధన్వి కీయొడలొప్పగించి నేను జీవించియుండునా? తల్లీ! చూడు,

మ. అనుయానుండగుభర్త చేసుఖమిక ♦ న్నాత్మత్వంబు చేపాటత
ప్ప నిజం బేమిసుఖంబొ యాశ్రితుపుడాం ♦ పత్యంబుచేఁ జాలు నో
జననీ! యాశతధన్వితోఁ జెలిమివే ♦ జన్మాంతరార్హ వల్దిఁకన్
దనువుం బాసెద ముందుజన్మమునకై ♦ సంగూర్పుమా మాధవున్.

(అని నిరాశతో) హాప్రాణకాంతా! హా! రుక్మిణీప్రియా? హా! యశోదాకిశోరా! హాబలానుజా! హా! కామినీమన్మథా! నీవుఁగానియీ నాశరీరముతో నాకేమి ప్రయోజనము? హతాశురాలనై నేను నీకై ప్రాణపరిత్యాగ మొనరించికొనవలసి వచ్చెనుగదా! కృష్ణా! కృష్ణా! నీచేత నుపలాలింపఁదగని యీనీచజన్మము నాకేల యాపిధి ఘటించెనో! అకటకటా! ఎంతటి నిరర్థకపుఁబుట్టువొందితిని,

సీ. అకట! పిల్లనగ్రోవి ♦ నైనఁగానైతి నీ
యధరామృతముఁగొంత ♦ యానుచుండ
నలతులసీమాల ♦ నైనఁగానైతి నీ
మెడఁగౌఁగిలించి నె ♦ మ్మిందఁగర్తు
నలకౌస్తుభమునుగా ♦ నైతి సంతతము నీ
పేరురంబున నల ♦ రారుచుండ
నలనెమ్మిపింఛంబు ♦ నైనఁగానైతి నీ
యుత్తమాంగమునఁ ద ♦ ళుక్కొత్తుచుండఁ
గీ॥ బుడమిఁగొఱమాలునీ యూడఁ ♦ బుట్టువొంది
ప్రాఁకుమాఱడివోదైన్య ♦ పడితిఁగాక
తుదకు నీసుందరాననా ♦ తొల్గుచుఁ
బుట్టనైతిఁగదా! యిఁక ♦ నెట్టియాస!

హా! కృష్ణా! మందభాగ్యురాలనగు నాకోర్కెలన్నియు నేఁటితోఁ బరిసమాప్తినొందినవికదా!

సీ॥ చిన్నారికోడలి ♦ చెలువ దేవకికంటు
పట్రిజ నన్నలుక ముద్దుఁ బడయనైతి
కొమ్మ రుక్మిణితోడి ♦ కోడలుగాదఁటే
సత్య నా నుడికేను ♦ జాలనైతి
పాంచాలి ద్రౌపది కాదు ♦ బిడ్డనై పాండవు
లనుసరింపఁగ వాసి ♦ నందనైతి
నెలఁతేనితోడి వ ♦ న్నెలలీల నేనీకు
నర్ధాంగినై కీర్తి ♦ నందనైతి
గీ॥ కోర్కెలన్నియు నేఁటితోఁ ♦ గూలిపోయె
నెవరికో యక్కెశరీరమిం కేటిబ్రతుకు
తనువుఁ జాలింతు నింక మాం ♦ దటికినైన
నన్ను గ్రహింపుమయ్య యో ♦ నల్లనయ్య!॥

[అని తీఁగె మెడఁదగిలించుకొనును]

శత— (హఠాత్తుగాఁ బ్రవేశించి)
శా॥ చాలుం జాలును గట్టివాయిపడఁతీ! ♦ శాంతింపుమీపాటికిన్
బోలుంబోలవు లెంచకీకడిదిచా ♦ వుం జత్తువే? నీ చగో
పాలుంగాని వరింపనొల్లవు తలం ♦ పన్ స్వర్గమా మోక్షమా
బాలా! యాత్రనేస్త? మెంతకుఁ దెగిం ♦ పంజాలినావక్కటా!
సాత్రి— అయ్యో! శతధన్వా! ఇప్పుడు నీవు నాప్రియత్నమును భంగముగావించి నాజీవనమును మఱింత దుఃఖభాజనముగా నొనరింపకు.
శత— నెచ్చెలీ! నీకేమిటఁగొఱంతయని నీజీవనము దుఃఖభాజనముగ? అయ్యో! నీకిదెక్కడి సాహసము?
వ॥ అలరుం బ్రాయము నేఁడు ద్రోసి, యిహసౌ ♦ ఖ్యానందమున్ ద్రోసినె
చ్చెలి పిండుం బెడఁబాసి, కన్న కడుపుం ♦ జింతాచితిన్ జేసి నీ
చెలిమింగోరి తపించు నా బ్రదుకుగా ♦ సింజేసి యేమంచుఁదా
య్యలి! పెట్టూరివోసికోఁ గడఁగితా ♦ హా! యెంతగయ్యాళివే॥
సాత్రా— అన్నా! శతధన్వా! నాతో వదరాకుము.

చ॥ ఎఱుఁగుదు నీమనోవికృతి ♦ నీవు నెఱుంగుదు నామనస్స్థితిన్
దఱచిన నేమిలాభము వృ ♦ థాదురపేక్ష వహింపఁబోకు నా
కొఱకు; మదీయమానసము ♦ గోపకిశోరునియందె రూఢమై
మఱలదు నాకు సన్నపుసు ♦ మా యిఁక నొందు తలంపు మానుమీ॥

శత—కామినీ! నీవు బొత్తుగాఁ బెడత్రోవ ద్రొక్కుచున్నావు నీపై మోహావేశమున నాడినమాటలు గావు నీకై నేనింత చెప్పుచుంటిని. కృష్ణునియందు నీవెంతయో దుర్భ్రాంతి వహించియున్నావుగాని వానినడవడి సుంతయోజింపవైతివి; చూడుము.

సీ॥ అరయఁ గొంపాగోడి ♦ యావానికొకవంక?
నూళ్లన్నియును వాని ♦ యునికిపల్లె
తనవారు నావార ♦ లనియెక్కడిదివాని?
కందఱుగారొదు ♦ రతనివారు
అచ్చుగనొకగుణం ♦ బావానికి కవగుణం
బులగుణంబులనొక్క ♦ లలిజరించు
ఉపమింపనొకకులం ♦ బున్నదే? కడజాతి
మొగిలికేయు ♦ నేవపడఁడు
గీ॥ చక్కఁదనమెన్న దమఁటన్న ♦ నొక్కగూపు
చందమేర్పడు నేవాని ♦ యందుఁబోల్ప?
గోల! నీపట్టినామూరా ♦ పాలులేని
వెడఁగువలచితి విదియేమి ♦ వెఱ్ఱిచెప్పుమ?॥

సాత్రా—ఛీ! ఛీ! కృష్ణదూషణమొనరించు నీముఖముఁ జూడఁగూడదు పొమ్ము.

శత—ఓసియజ్ఞానురాలా! ఎందునకై నాపై నీకీయసూయ? నిజంబాడిన నీకు నిష్ఠురమాఁగాని,

ఉ. నాత్రిరో! కాఱుమబ్బువలె ♦ నల్లగఁ లేనిదూ? పదారువేల్
వేశ్యలతోడ వేగెడుప ♦ విత్రుఁడగానని యూ? మఱెందుకీ
మూతిబిగింపునన్ననిన? ముద్దియ! ♦ నీకలవెన్నదొంగమో
తాతలనాఁటిచుట్టమయి ♦ తాశతధన్వుఁడుగాక పోయెనే?

సాత్రా—అయ్యా! శతధన్వా! నాపై నీకేటియసూయ? నీవు సాక్షాన్మన్మథుఁడవే యనుకొమ్ము; అయినను నీయందుఁగాక కృష్ణునియందు బద్ధానురాగనగుటకు గారణముఁ జెప్పుమన్న నీవు నేమని చెప్పెదవు చూతము,

చ. తొగమొగమున న్ముడించికొనఁ ◆ గోయజమిత్రుని దోసమేమొ యిం
పుగ వికసింపఁ జంద్రికృత ◆ కృత్యమదేమొ యెవం డెఱింగెడిన్
బగయొ ప్రియంబొ యొక్కరి ◆ కైన నొకప్పుడ కారణంబుగాఁ
దగులు; ననన్యవేద్యము, న ◆ తర్క్యము దీని నెఱుంగు దుర్మతీ!

మఱియు,

గీ. చక్కఁదనముగాదు ◆ సరసత్వముంగాదు
కులముధనముచదువు ◆ గూడఁగాదు
పడఁతి యొకనిమేలు ◆ పడుటకు మూలంబు
జడుఁడ! వారిపూర్వ ◆ జన్మకృతము.

కత—ఏమీ నేను జడుఁడను దుర్మతినా? నీవు సన్మతివా? కానీ యిప్పుడేల? నీవా ఱెడ్డిగొల్లతోఁ గాపురముఁ దిద్దుకొనుట చేఁజూడక పోవుదునా? అబ్బో! ఆభోగ భాగ్యము లనుగవలెనా? నీవాగోపాలునే కట్టికొమ్మా,

సీ. చలిదిచిక్కాలూని ◆ ఛలగోలఁ జేఁబూని
కానలోఁ బసులను ◆ గాయవచ్చు
ఊరూరఁ బెరుగుపా ◆ లోయమ్మ కొనుఁ డంచుఁ
గుండ మూపునఁ బెట్టి ◆ కులుకవచ్చు
పదియారువేల స ◆ వతులతో సిగపట్లు
ముచ్చటలను ప్రొద్దు ◆ బుచ్చవచ్చు
మగఁడూరఁ గొంపఁగొం ◆ పలఁ దోచి తెచ్చిన
గడవతో నీవిల్లు ◆ గడుపవచ్చు
ఆ. వె. ఇన్నిసిరుల కేమి ◆ యింతటనంతట
గొల్లవారియింటి ◆ కొదలవని
అవని లోకులెల్ల ◆ ననుకొన్న చేచాలు
వన్నెవాసి నీకు ◆ నన్నుమిన్న!

సాత్రా—ఛీఛీ! మూఢమతీ! పరనిందాపరాయణా! అలోకగుణసంపన్నుండును భగవంతుఁడునగు కృష్ణుని దొంగయనిదూషించుటను నీ వామహామహుని మహిమం బేమియుంగుదువు? చూడు,

సీ. ఘన యోగిజనమనో ♦ ధనము ముచ్చిలి యెందు
దొరకకుండెడుగద ♦ దొంగయతఁడు
ముక్తికాంతామణీ ♦ సక్తులౌ విటులకు
వెరపుఁజూపెడు పెద్ద ♦ విటుఁడతండు
పలువతారకళసి ♦ పసులను సదలించి
ఘనతఁజెందిన మంద ♦ గాపతండు
వసుమతి యనుగోవు ♦ వలన ధర్మంబులన్
బాలుఁబిండెడు గొల్లఁ ♦ వాఁడతండు
గీ. అన్ని గుణములతో నిండి ♦ యున్నవాఁడు
గుణములకతీతుఁడై నెల ♦ కొన్నవాఁడు
వెడఁగ! నీవేల నేనెతె ♦ ల్పెదను వినుము
దొంగలకు దొంగ దొరలకు ♦ దొర యతండు.

శత—ప్రేమాధిక్యముచేఁగృష్ణునిఁ భగవంతుఁడని యెన్నిఁజెప్పఁగలవు చూడు,

గీ. తనకుఁబ్రియమౌపదార్థంబు ♦ ననుగొఅంత
యెంతయుండినఁగనఁబడ ♦ దింతయేని
చండభానునిలోనివె ♦ చ్చందనంబు
కలువకేకాక నలినికిఁ ♦ గానఁబడునే?

సాత్రా—నిజమే కనఁబడదుకావున నే,

మ. అడి మాసంపదఁ జోను నావలన నీ ♦ కావంత యోగ సాఖ్యమే
ర్పడ దన్యోన్యము చిత్తములలిసి నీ ♦ రక్షీరమట్లున్న య
ప్పుడు సంసారము రక్తిగాక పెడమో ♦ ముం బెటు నాతోడ నీ
కడుగైనట్ బడినాగునే? పడకపా ♦ మైనన్ను వేధింపనే?

శత — కాంతా! నీకింతటిమూఢప్రచారము తగదు. సిరిరా మోకాలడ్డినట్లు నాయంతవాఁడు నిన్నపేక్షింప సవినయమునఁ ద్రోసివేయుచున్నావు. ఏల నిష్కారణముగాఁ జెడిపోయెదవు?

మ. ననుఁబోఁడుల్పదివేలు నీకుఁగను స ♦ న్నన్ దాస్యమున్ సల్ప మ
న్ననఁ గీఁచినఁ గీఁటుదాటక త్వదా ♦ జ్ఞల్ నేను సాఁగింప నా
ధనమున్ బ్రాణము నీయధీనముగ ర ♦ త్నస్నిగ్ధసౌధంబులం
దనుభోగింతువు నన్వరించిన నన ♦ న్యాయత్తభోగంబులన్.

సాత్రా — అన్నా! యేమిటిమాటలాడెదవు? నీవంతకంతకు నీమూర్ఖతను బయలుజేసికొనుచున్నావు నీకు యుక్తాయుక్తజ్ఞానము భగవంతుఁ డేలప్రసాదింపఁడయ్యె?

శా. స్వాంతంబింతకుమున్నె యొక్కనిపయిన్ ♦ హత్తించియున్నట్టి శు
ద్ధాంతస్త్రీ బలవంతపెట్టి యిటురా ♦ ద్ధాంతంబుగావింతె? నా
యంతర్వృత్తికి నేవిరుద్ధముగ నీ ♦ యైశ్వర్యమాసించి నీ
పొంతంజేరినమాత్ర మెంతటిసుఖం ♦ బుంగాంతు నాచెంతలన్.

ఉ. మాటికిభోగభాగ్యముల ♦ మాటఁ దలంతువు; మాధవుండు నీ
పాటికిరాకయున్న విభ ♦ వంబున రాఁడనుకొమ్ము భాగ్యపుం
గోటికిఁబాటియొక్కఁడికి? ♦ కూర్మిఘనంబున కమ్మట్టిరో
బోటికిఁగాక నీవిభవ ♦ పుంగొడవల్కులకన్యకేటికిన్?

ఇంక నీవెడగుంబోకడల మానుము,

గీ. విపుల ధనవంతుఁడైన ని ♦ త్పోదయైన
రూపవంతుఁడైయైనఁ గు ♦ ణాప్తుఁడైన
గృష్ణునిందక్క నన్యువ ♦ రింపఁబోను
అతనితోఁ గంజియైనఁ బా ♦ యసమునాకు.

ఇట్టి నామనోనిశ్చయము బ్రహ్మాదులుం ద్రిప్పనేరరు నీవింక నావలనుంబొమ్ము.

శత — ఛీఛీ! యెంతచెప్పినను నీవాగయ్యాళితనము మానవైతివి. నీమనోనిశ్చయము బ్రహ్మాదులుం ద్రిప్పనేరరుగా? ఎట్లు దిరుగదో చూచెద. సామవాక్యముల నీమనంబుఁ జేకొనుట లెస్సయని యింతదనుకఁ బెనంగితిగాని యిప్పుడు నిన్నెత్తికొనిపో

యిన నీకిక్కడ దిక్కెవ్వరు? ఇంక నీయందు దండోపాయమే ప్రయోగింపవలయును

సాత్రా — ఏమి శతధన్వీ! నీకింతటిదుర్మతము పుట్టుటఁజూడ నీకు వినాశకాల మాసన్న మైనట్టున్నది. అకటకటా!

చ॥ మతికరి! నేఁటికెంత మతి ♦ మాలిన వెంగలివైతి నక్కలా
తృక్కతిగ హరించితేయువ ♦ రింతువె నన్నిఁ? బ్రతిమాలుచున్న మొం
డితనము మానవైతివి; క ♦ డింది పనుల్ చనవింతనుండియున్
బ్రతుకుము నీకు మేల్పడిన ♦ భార్యనుఁ జేకొని ముద్దుముద్దుగన్.

శత — చాలుఁజాలు నీబుద్ధులు నేను వినవక్కఱలేదు. మిత్రమా! శంబరా! రమ్ము ఈకలంకులాడికిఁ దగిన శిక్ష కావించినఁగాని దీనిదుర్మతముమానదు.

(శంబరుఁడు దేవిగుడినుండి ప్రవేశించును)

సాత్రా — (సంభ్రమముతో) (తనలో) అక్కటా! దిక్కుమాలి యొంటరిపాటున నీదుర్మార్గులచేఁ జిక్కితిఁగదా. ఇప్పుడు నాచేత నాయుధమున్న నీరక్కసుల నుక్కడింగించివైతుఁగదా.

శంబ — బోఁడీ! ఇఁక నీ మాటలు సాఁగి రావు. నీవిఁకఁ గదలుము. మామధురాపురమున కొఱకేర్పఱచిన చెఱసాలం బ్రవేశింతువుగాని,

సాత్రా — శతధన్వీ! నీవంశక్షయమగుట నీవూహింపక దురాత్ములగు రక్కసుల దురాలోచనములనుండి చెడిపోవుచున్నావు. ఓరీ దుర్మతీ!

మ॥ పరకాంతన్ హరియించి బాగుపడె నె ♦ వ్వాఁడింతకున్ రావణా
సురవృత్తాంతము నెన్నఁడున్ వినవె యె ♦ చ్చోనైనై దుఃఖప్ర
సరణంబేటికి నెత్తిఁగట్టుకొన యు ♦ ష్మద్వంశ విధ్వంసన
స్ఫురదుత్పాత ధూమకేతువు నటం ♦ చున్ నమ్మ నన్నీవు మా

మ॥ హితవాలింపక రాక్షసంబెకితవో ♦ ద్వృత్తిం బ్రయోగింప నెం
చితివా? నేనును నస్త్రశస్త్రములవై ♦ శేష్యంబు నొక్కింత నే
ర్చితి విల్లో కరవాలమో యొసఁగి వా ♦ సింబోరుమా నేర్పుఁగా
ష్ఠిత నాయోధనతనంబు నీమగతనం ♦ బుం బీరముల్లోకముల్

శత — ఏమీ! యుద్ధమొనర్తువుగా! తొండముదిరయూసరవెల్లియైనట్లున్నది. పెట్టపెరిగి పుంజయినదే! ఎట్లూ చెప్పవు!

చ॥ ఔలఁదిరో! యింతపాటిమగ ♦ బీరము లెప్పుడు నేర్చినావు? గా
జులుదొడిగించుకొంచు సరి ♦ జోటులతో నొకమూలనుండఁగా
వలసిన యాఁడుపుట్టువు న ♦ బంటుతనంబున నేఁడు వాలుఁగ
బలుకయుఁ బూని మేటిమగ ♦ వారలఁబోరికిఁ జీరుచుండిగా॥

ఏమీ! కాలమహత్త్వము! ఓసీచండీ! నిన్నవలశినదేమి కాలమిట్లున్నదికాని నీబెదరింపులకుఁ జాలించి రథమెక్కుము.

సాత్రా — ఛీఛీ పిటికిపందా! ఏమినీచపుబ్రతుకు బ్రతుకుచుంటివిరా?

గీ॥ పుడమినగవాఁడవై తల్లి ♦ కడుపుఁ జెఱుప
జననమొంది గడ్డాలు మీసా ♦ సాలు పెంచి
పడఁతిచే యుద్ధమునకుఁ బి ♦ ల్వంగఁబడియు
పాదవలెయూరకుందువే ♦ పాడుబోడువ!॥

చేతకాక స్త్రీలు యుద్ధమొనరించుట కాలమహత్త్వమని యొకసెక్కెములాడుచున్నావుగా విద్యాశూన్యుఁడవైన యోపశువా! మూఁడు,

శా॥ విల్లుంగైకొనవుఁ జేఁబూని సమరో ♦ ర్విన్ ఘోరవీరవ్రతో
ద్యల్లీలన్ విహరించి రెండవనెలం ♦ తల్ శౌర్యవిద్యాది భా
స్వల్లాభంబులు స్త్రీల కేటికి బహి ♦ ష్కారంబు? నీవంటి పా
దలజ్జింపుఁ పురాణవీరయువతీ ♦ దర్పోద్ధతుల్ విన్నచో॥

మూఢుఁడా! స్త్రీజనమంతలాఘవమయ్యేనేమి!

సీ॥ చండముండాదిర ♦ క్షఃకోటినొంపదే
యాదిగర్భేశ్వరి ♦ యైనదుర్గ
ఖలులఁ బెక్కండ్ర నా ♦ ర్యులరూపుమాపదే
వీరవ్రతాచార ♦ విశ్వవార
పరిపంథిరాడ్ద్వ ♦ భరమణంపదె విశ్వ
లాకవికీర్తివ ♦ ల్లరికిఁదావి
అరిభయంకరవిక్ర ♦ మాధ్యగాదేవవ్రి
పతియనునింతి చె ♦ ల్వాలవలంతి

గీ॥ వెడఁగ యెన్నటిమాటలో ♦ తడవనేల?
ప్రమిలయనువీరకాంత యి ♦ ప్పటిదె కాదె?
వీరిలో నీవుచెప్పు మె ♦ వ్వారికీడొ
పాడుమగరూపుగొన్న యో ♦ యాఁడుదాన!॥

శంబ — మిత్రమా! దీనికంతకంతకు మాటలు హెచ్చుచున్నవి; దీనిం బలిమిమైఁబట్టి రథంబునఁ బెట్టెద. (అని సమీపింపఁబోవ)

సాత్రా — శతధన్వా! నిరాయుధనై యుండుటచే నీకుం జిక్కవలసివచ్చె. కానీ! నేనే రథ మెక్కెదను? నన్నిట్లు చలంబట్టి నీవనుభవించు సౌఖ్యమేడియో చూచెద. ఆర్తరక్షాపరాయణుండైన భగవంతుఁడు నన్నురక్షింప కేలవిడుచునో చూచెద. యిదే రథ మెక్కితిని. (రథమెక్కి)

సీ॥ నాఁడు గజేంద్ర సం ♦ త్రాతుఁడైన దయార్ద్రి
నేఁడు నాకును దోడు ♦ నీడగాఁడె
నాఁడు రావణుని పైఁ ♦ దోడు నేలిన ఱేఁడు
నేఁడు నాకును దోడు ♦ నీడగాఁడె
నాఁడు పాంచాలి బ ♦ న్నము వాపిన ఘనుండు
నేఁడు నాకును దోడు ♦ నీడగాఁడె
నాఁడు రుక్మిణికి మ ♦ న్ననఁ జూపిన మగండు
నేఁడు నాకును దోడు ♦ నీడగాఁడె
గీ॥ ఘనత నాపన్నరక్షణాం ♦ క ప్రసిద్ధ
బద్ధకంకణుఁడైన కృ ♦ పాపయోని
సంతతాత్మైకచింత నా ♦ స్వాంత, దుష్ట
పరిభవాక్రాంతనగు నాకుఁ ♦ బ్రాపుగాఁడె

శత — శంబరా! చూచెదవేమి? మనైశ్వర్యరథము రాకమున్నే దీనిని మథురాపురమందలి కారాగృహము చేర్పవలయును; రథముపోనిమ్ము. (రథమున నడుపుచున్నారు)

సాత్రా—

శా॥ అకటా! యెక్కడనుండనుంటివీయెడను కృష్ణా! దీనమందార! న
న్నాకనీచుండు పరాభవించునెడన ♦ య్యో! పోవనిమ్మందుఁ జెం
తకునైనన్ జనుదేర వింతకఠిన ♦ త్వంబూన మేలయ్య! మా
నక నిన్నే మదినమ్మియున్నసతినిన్ ♦ నట్టేటిలో ముంచెదే? ॥

అకటకటా! నాకింకదిక్కెవ్వరు నా యవస్థ నెవ్వరు నామనోహరునకెఱింగింతురు?

సీ॥ గోపాలునకు నాదు ♦ గోడెఱింగింపరే
మందముల్మేయు నాల ♦ మందలార!
మురళీధరునకు నా ♦ దురవస్థఁ దెల్పరే
శృతిసూనుచో మధు ♦ వ్రతములార!
రామానుజునకు నా ♦ బాముఱింగింపరే
శ్రీరామనుతిసల్పు ♦ చిలుకలార!
వనమాలికి నావి ♦ పద్దశఁ దెల్పరే
సుమనోమనోహర ♦ ద్రుమములార!

గీ॥ అరుణుచేఁజిక్కి దిక్కరి ♦ యంగలార్చు
నాకు గంపంబుచీకటి ♦ నట్టిలోక
బాంధవుఁడవయ్యు నిట్లేగఁ ♦ బాడియయ్య
కరుణ నీకేలరాదయ్య ♦ కర్మసాక్షి!.॥

శంబ—మిత్రమా! వాయువేగమున రథముఁదోలుకొనిపోయి నీవు మధురాపురమునకు జేరుము. (రహస్యముగా) నేనిప్పుడు వసుదేవునింటికేగి పుత్రుండు రామికి జింతిల్లుచుండెడు నావృద్ధుని మఱింతయేడ్పించివచ్చెద? నీవుపొమ్ము.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది చతుర్థాంకము.

# సాత్రాజితీయము

## పంచమాంకము.

(రంగము వసుదేవుని మందిరము)

(వసుదేవుఁడును అక్రూరుఁడును ప్రవేశించుచున్నారు).

వసు—అక్రూరుడా! ఇన్నిదినములైనను కృష్ణుఁడు మరలి రాకుండుటకుంగతమేమై యుండును? నందాదులును కుఱ్ఱవానిం జూడనలయునని యెంతో కుతూహలపడు చున్నారని నిన్ననే బృందావనమునుండి వర్తమానమువచ్చినది. శాత్రవభూయిష్ఠమైన ప్రదేశములఁ బెద్దవాఁడు బలరాముఁడును వెంటలేకుండఁ గొండికవాఁడిట్లు సంచరించుచు నింతకాలముమసలుటచే నాకేమియుండోఁపకయున్నదికదా.

అక్రూ—రాజేంద్రా! కృష్ణుఁడు శ్యమంతకాన్వేషణమునకై బయలువెడలుట మీరెఱుంగుదురుకదా. ఆమ్మణికై యతఁడెందుఁదిరుగుచుండెనో అమ్మహామహుఁడెక్కడసంచరించుచున్నను నతనికేమిభయము? ధాత్రీతలంబశేషంబతనిచే నీవరకే నిశ్శేషశాత్రవంబుగానొనరింపఁబడినది. ఇంకశాత్రవులవలనిభయమెక్కడిది? కుఱ్ఱవాని బలపరాక్రమంబులెఱింగియుండియు నేలభయమొందుచున్నారు?

మ॥ శకటారిన్ దెగటార్చె, నోర్చె బకునిన్ ♦ చాణూరుమర్దించె ము
ష్టికు నష్టంబొనరించె వత్సకునినొం ♦ చెన్ జించెఁగాళింగుఁగం
సకులధ్వంసమొనర్చె నట్టితనయున్ ♦ సామాన్యుగానెంచి మి
న్నక చింతించెదుకాని వానికెటనై ♦ నన్ గీడు చేకూడునే?

వసు—వానికేమికీడుగాని యెందున్నాఁడో వర్తమానమైనరాకున్నదే యని దిగులొందుచున్నాను.

అక్రూ—వర్తమానమేటికి? నేఁడో రేపో యతఁడే కృతకృత్యుఁడైవచ్చును.

(భటుఁడు ప్రవేశించి) దేవా! ద్వారమునందొక యతీశ్వరుఁడు వేచియున్నాఁడు.

వసు — అక్రూరుడా! ఆమహామహుని మనమే ప్రత్యుద్గానము చేసి పిలిచికొనివత్తము రమ్ము. (అని ద్వారముకడకువత్తురు పిమ్మటనొక కపటయతి ప్రవేశించును)

యతి — ఆహా! మిత్రకార్యము దీర్చుటకు నేనింతవఱకెన్ని పోచికోలు వేసములు వేసితిని.

గీ॥ తెగువగడ్డాలు మీసాలు ♦ దీసివేసి
ఆడువేసాలతో నాట ♦ లాడినాఁడ
మూతికడ్డముగా గుడ్డ ♦ మూతజేసి
మొండినై యుప్పు కపటవ్రతి ♦ దండినైతి ॥

ఎన్నిపాట్లుపడినను కార్యము సానుకూలమైనచో నంతచింతయుండదు. కార్యమనుకూలపడక యేమి? మణిం గణింపకపోయినను సాత్రాజితినిహరించి శతధన్వనిచేత నుంచితిగదా. కృష్ణునకెట్లును మణిలభింపదు. లభించినను వానికాకన్యం దక్కనీయను. కృష్ణుఁడింకను మరలిరాలేదని తెలిసినది. వాఁడువచ్చునంతలో వసుదేవాదులకొక దుర్వార్తం దెలిపి బలరామాదులతో వసుదేవుఁడు చిమ్మురుకునట్లు చేసెదను. పిమ్మట నసహాయుఁడైనకృష్ణుని ననాయాసముగాఁ దెగటార్చెద. అప్పుడుగదా కంసుని ఋణము దీర్చినవాఁడనౌదు.

వసు — యతిచూడామణీ! నమస్కారము. దేవర యీపీఠంబలంకరింపుఁడు.

యతి — మీరును మీ మీ పీఠంబులఁగూరుచుండుఁడు.

వసు — చిత్తము మునీంద్రా? తామెందుండి యిందులకేతెంచితిరి? మీవంటిమహానుభావులరాక కేదేనిమహాత్కారణ ముండకపోదు. ఏమైనను,

శా. ధన్యంబయ్యె గృహంబు, జన్మము కృతా ♦ ర్థంబయ్యె, మూర్ధంబున
న్మాన్యంబయ్యె భవత్పదాంబుజ రజో ♦ న్యాసంబునన్ మాలిమూ
ర్ధన్యా త్వాదృశయోగివర్యులు నప ♦ ర్యాబ్ధి మావంటిసా
మాన్యగృహస్థులకున్ లభించెను తలం ♦ పంబుణ్యమింకేమనన్.

యతి — (స్వగతము) ఆహా! పుణ్యము చెప్పవలసినదేమి స్వర్గసుఖమే చేకూరనున్నదికదా. (ప్రకాశముగా) రాజచంద్రా! నీయుపచారవాక్యములకే నెంతయు సంతసించితిని. నీవంటి సంపన్నగృహస్థునకు నానోటిమీఁదుగానొక దుర్వార్త నెఱింగింపవలసివచ్చినందులకు నేను లోలోఁ గృశించుచున్నాను.

వసు — యోగివరా! దుర్వార్త యెవ్వరివిషయమున?

యతి — ఎవరివిషయమో యైనచో నింతచింతయేందులకు? మనకృష్ణునివిషయమే.

వసు — అయ్యో! మునీంద్రా! మాకృష్ణునికేమికీడుమూడినది?

యతి — ఏకీకృతమూడిన మనమేమిచేయఁగలము? చూడుము,

మ. ధరఁబుట్టొందిన ప్రాణికెక్కడి స్థిర ♦ త్వంబాయువుల్దీరఁ జ
త్తురు వేఱొక్కెడఁబుట్టుచుందు రలం ♦ తులూర్మిద లైమోహసం
సరణభ్రాంతి సతీసుతాలయ దురా ♦ శంజిక్కి దుఃఖింతురో
క్కరికైకె యోగ్యరుప్రాజ్ఞులై చెదరు దుః ♦ ఖంబుఁగ సుఖంబొక్కమై

వసు — యోగివరా! ఎందులకీ వేదాంతములు?

యతి — పుత్రవియోగ దుఃఖోపశమనమునకు.

అక్రూ — మునీంద్రా! పుత్రవియోగదుఃఖ మెవ్వరికి?

యతి — ఈదేవకీ వసుదేవులకు.

వసు — హా కృష్ణా! (మూర్ఛిల్లును)

(దేవకి ప్రవేశించి) అక్రూరుఁడా! ఏమి యప్రియము!

అక్రూ — అయ్యో! ఇంకేమున్నది. ప్రపంచమే మునిఁగిపోయినది.

వసు — హా కృష్ణా హా! బలానుజా! హా! యదుకులధురంధరా! హా! యశోదా కిశోరా! హా! పాండవపక్షపాతీ! హా! శకటాసురభంజనా! హా! వేణునాద విశారదా? హా భువనైకమోహన? (మూర్ఛిల్లును)

దేవకి — కొడుకా! నేను చావనేచచ్చితిని. (మూర్ఛిల్లును)

అక్రూ — అయ్యో! అంతబలపరాక్రమశాలియైన కృష్ణుఁ డెవ్వనిచే వధింపఁబడియె?

వసు — మునీంద్రా! నాకుమారునకు మారకుండైన యాక్రూరుఁ డెవ్వఁడో సెలవిండు?

యతి — వనిన న్వేషింపఁబోయిన నీకుమారునిఁ గంసమిత్రుండగు శంబరాసురుఁడు పట్టి వధించినాఁడు.

దేవకీ — హా! బిడ్డా! కన్నకాన్పులన్నియు నాకంసునిపొట్టఁబెట్టి నిన్నొకనినైన మిగిల్చుకొంటి ననుకొంటిరా తండ్రీ! దైవమునిన్నుఁగూడ మాకెడఁజేసెనే?

వసు — అక్కటా! ఎంతవైపరీత్యము సంభవించెను.

మ॥ బకచాణూరక ముష్టికాదిరిపు సంబా ♦ ధోగ్ర బాహాబల
ప్రకటుండౌ సుతుఁ డొక్క శంబరునిచేఁ ♦ బ్రాణంబుఁ గోల్పోక, సిం
హకిశోరంబును గుక్క చంపుటయు త ♦ థ్యంబింత ప్రారబ్ధమా
అకటా! దేవకికన్న కాన్పులిటుల ♦ న్యాయంబులై పోవునే!

అక్రూ — అకటకటా! ఈఘోరవార్త విని మందభాగ్యురాలగు రుక్మిణి యింకేమిచెప్పఁ గలదు! అయ్యో! నేఁటితో యాదవవంశమంతయు నస్తమింపవలసిన దుర్యోగము సంభవించెనుగదా.

దేవకి — అయ్యో! అక్రూరుఁడా! ఇంకఁ గోడలు రుక్మిణి బ్రతుకుట యెక్కడిమాట ?

రుక్మి — (ఆతురతతోఁ బ్రవేశించి) ఏమిసంభవించినది?

వసు — కుమారీ! ఇంకేమున్నది,

సీ॥ భాగ్యహీనయగు దే ♦ వకి యెన్మిదవ కాన్పు
యాదవాన్వయ భూరు ♦ హాంకురంబు
పడతి యశోద కే ♦ ర్పడిన నోములపంట
పల్లవీ జనమనో ♦ వల్లభుండు
కంసాది ఘోరరా ♦ క్షస వీరసంహారి
నిరత బృందావనాం ♦ తరవిహారి
కాళీయఫణిశిఫణా ♦ గ్రముల నట్టువకాఁడు
గోరక్షణము సల్పు ♦ గొల్లవాఁడు

గీ॥ మకరకుండలమండన ♦ మండితుండు
వేణుగానసుధారస ♦ విస్ఫురితుండు
నాకుమారుండు ఏమనో ♦ నాయకుండు
భూమిపై లేఁడు మాయమై ♦ పోయినాఁడు.

రుక్మి — హా జీవితేశ్వరా! హా భువనమోహన (మూర్ఛిల్లును)

దేవ — అయ్యో! కోడలా! మాకన్నులయెదుట నే నీకింతటి యవస్థసంభవించెనే. అమ్మా! నిన్నునే నేమని యూరడింతు?

వసు — హా కృష్ణా! ఏండ్లుగడచి చీకులమై త్వదేకశరణ్యులమై జీవించుచున్న నీజననీ జనకులగు మాకును నిన్నుగా కితరుని వరింపనని పట్టుపట్టి నీయొద్దఁజేరిన యానీస్వయంవరవధువును రుక్మిణికిని నేదారిఁ జూపిపోయితివి? తండ్రీ! నీకుఁబెనుమృత్యువుగా నా కంబరుండెక్కడ దాఁపరించె? నాయనా!

మ॥ అవినీతిన్ గరపాదబంధములఁ గా ♦ రాగారమందుంచి మ
మ్మవినీతిన్ బెట్టిన కంసునిన్ దునిమి మా ♦ ప్రాణంబులన్ గల్పినాఁ

డవు; ఘోరంబుగ నీదురంతమును గూ ♦ డన్ గంటిమద్ధ్వాన, నెం
త విరుద్ధ పుటవస్థకై మలిపెఁ బు ♦ త్రా దైవ మీచీకులన్॥

రుక్మి—హా జీవితేశ్వరా! భువనైకవిక్రమ కళాధురంధరుండ వగు నీవు నేఁటికొక నీచదానవునిచే నంతమొందుట నాదురదృష్టము గాక మరేమున్నది? హా! ప్రాణపతీ! నన్నుఁ బరిణయం బగునాఁడు శిశుపాలాది శూరులఁ బెక్కండ్ర నుక్కడంచిన నీబాహుశౌర్యము నేఁ డేమైనది? జనకునకు ననిష్టమైనను సోదరునకసమ్మతమైనను నిన్నుఁ గాక నన్యునివరింపనని పట్టుబట్టి తుట్టతుదకు నిన్నే పెండ్లియాడిన యీరుక్మిణి కింతలో నిట్టియిక్కట్టు సంభవించెనే? హా! హృదయేశ్వరా! నిన్ననుసరించి చిత్తము భవదాయత్తంబొనరించికొనిన యిల్లాలిఁ దగనాడఁ జనునే? కృష్ణా! వాసుదేవా!

ఉ॥ ఏగతి నన్ను బాసెదు హృ ♦ దీశ్వర! నీవెట కేగుచుండినన్
నీవెనువెంటనే నడుచు ♦ నీడను నన్నెడబాప నేరికా?
పావనశీలయౌ సతికి ♦ భర్తృవియోగమదేడ? చిత్తరా
జీవము నీయెడన్ నిలిచె ♦ చీ! తను వేటి కిదే త్యజించెదన్.

దేవకి—బిడ్డా! రుక్మిణీ! నీవేత్రోవఁబట్టెదవో నేనును నాత్రోవనే యనుసరించెదను.

వసు—కుమారీ! ఊరడిల్లుము నీదుఃఖమునకిఁక మేర యెక్కడిది? నాయనా! కృష్ణా! ఎంతకష్టము తెచ్చిపెట్టితివోయీ

చ॥ చుఱచుఱఁగాల్చు నీకడుపు ♦ శోకము చేత నె చచ్చుచుండఁగాఁ
బురపుర నీవియోగమునఁ బొక్కుచుఁ గన్గవ బాష్పపూరముల్
గురియుచు నేడ్చు నీయనుఁగు ♦ కోడలిదుఃఖముఁ గూడ నయ్యయో
కఱకఱ ఱంపమై కడుపుఁ ♦ గండలఁ గోయుచునుండెఁ బుత్రకా!

నాయనా! ఇంతదురంతమైన దుఃఖమున దినదినము కృశించి చచ్చుటకన్న నిప్పుడే మేమందఱ మగ్నిముఖంబునఁ బ్రాణపరిత్యాగం బొనర్చికొనుటయే మేలుకాదే.

యతి—రాజా! గోత్రపవిత్రుండగునట్టి పుత్రుండు గతించిన వెనుక మీకింక నీశరీరములతో నేమిపని? మేము నీసాహసకర్మంబులఁ జూడఁజాలము కానఁ బోయెదము (స్వగతము) నేఁటితో నీయాదవవంశమంతయు నంతమొందఁగలదు నన్నెవ్వరు గుర్తింపకమున్న నేనిక్కడనుండి వెడలిపోవుట మంచిది. (నిష్క్రమించును)

అక్రూ — (స్వగతము) దుఃఖోపశమన వాక్యంబులాడక యీమానినియు నీవసుదేవుని సాహసకర్మంబులకుఁ బ్రోత్సాహము చేసిపోయెఁగదా. అయ్యో! యదువంశంబు నేటితోఁ బేరు మాసిపోవలసెనా! (ప్రకాశముగా) రాజేంద్రా! ఈదుఃఖము తలంచికొన్నచో మేరయే లేదు. ఇందొకరు చెప్పవలసినదేమున్నది? మీదుఃఖము మీరే యుపశమించుకొని మందభాగ్యురాలైన దేవకీదేవిగారినూరడింపుఁడు

దేవ — అయ్యో! అక్రూరుఁడా! ఇంక నాకెక్కడి యూరట?

వసు — అయ్యో! ఇంకెక్కడిశాంతి అట్టి కొడుకే నాఁటికైన మఱపునకువచ్చునఁటోయి?

మ॥ లలితంపుంజిఱునవ్వు వెన్నెలలఁజి ♦ ల్కంజాలు నామోము జా
బిలియందంబు, దయామరందమసృణ ♦ స్విన్నంబులౌకన్నుఁ గ
ల్వలచెల్వంబు మహేంద్రనీలశకలా ♦ భంబైన యామేనిక్రొం
దళుకా సిద్ధపుమూర్తియే మఱతున ♦ న్నకా శక్యమే యెన్నఁడేఁ

అక్రూరుఁడా! నేనుగాను ప్రపంచమున నాతేజస్విని మఱచి పోవఁగలవారెవ్వరు? అయ్యో! ఇంక లోకమున శోభయెక్కడిది? తండ్రీ! గోపాలకృష్ణా!

చ॥ భువనములందుఁ జక్కఁదన ♦ పున్నిధి యారడివోయె గోపికా
యువతులకన్నుదామరల ♦ యుత్సవముల్ నశిపోయె మాన్యహృ
ద్భవనములెల్ల శూన్యతను ♦ బాడఱిపోయె భవద్వియోగమె
ల్లవిధములందు లోకపు వి ♦ లాసమె లోపముచేసె మాధవా!

అక్రూ — ఆహా! అట్టి తేజోమూర్తి యస్తమింప లోకమునకు గంపెఁడుచీఁకటిగాక మఱేమున్నది?

వసు — నాయనా! కృష్ణా! నీబ్రతుకింతలో ముగించుకొంటివి. తండ్రీ! విచారించిచూచిన

ఉ॥ ఎందులకై జనించితివొ ♦ యెందులకై తనువుం ద్యజించితో
నందన! నీచరిత్ర ... వి ♦ నంగన నేరికగమ్యమేల నా
యందొక కండ్రివావిడల ♦ యంక భువిపై నటించుచుంచి యింతలో
నిందతికింత దుఃఖముగ ♦ నీగతి నాఁడివోయితో సుతా!

చ॥ బ్రతికిన నాల్గునాళులు ప్ర ♦ పంచమునందతిలోక వర్తనా
ద్భుత మహిమంబుచే వెలసి ♦ పోయితి దిక్కులఁగీర్తినించి హా

సుత నిటు గన్నవారికిఁ ♦ శోకము మాత్రమె మిగిల్చి నింతకున్
బ్రతికిన మాయభాగ్యపరి ♦ పాకము దూరెదఁగాకఁ గేమనన్ ॥

రుక్మి—మామా! ఇంకేల యాలస్యము. పూజ్యురాలగు నత్తగారితోఁగూడ నేనిఁక నీ
చ్చటికి నాప్రియతమునిఁ గలిసికొందును. మీరును మీ యిచ్చవచ్చినట్లాచరింపుఁడు.

వసు—హా! ఎంతఘోరము సంభవించెను. దేవీ! దేవకీ! నీ వెంతటి యదృష్టహీనురాలవు.

క॥ కడుపెడు సంతానము గన నే
ర్పడియెన్ దుది నీవు గొడ్డు ♦ రాలితనంబే
పొడగనఁ బాగిలెగయుచు నీ
కడుపు దహించుచునె యుండె ♦ గా నిప్పటికిన్ ॥

హా! తండ్రీ! హా యశోదాకిశోరా!

చ॥ కడుపునఁ గాంచుటే తడవు ♦ గాఁ గసికందును నిన్ యశోద చే
నిడి తా నెఱుంగ నిన్నెనుచు ♦ లేఁ దయఁ గంసుని బారికిన్ భయం
పడి యెటనేనియున్ బ్రతికి ♦ బాగుగ నుండినఁ జాలు మంచపుం
దోడుగుల మైన మాకుఁ దిల ♦ తోయములిత్తువటంచు నమ్మఁగాఁ
గడకిటు నీకె మేము కొడు ♦ కా! విడుమంటిమి బాష్పపూరముల్

అయ్యో! ఈఘోరవార్త బృందావనమునందలి నందాదులును బలరాముఁడును విన్న
నేమగుదురో. నాయనా! బలరామా! నాప్రార్థమున నీవు నీతమ్మునికి సహాయము
గుట కాతనివెంట నుండుమని తటస్థించినదే.

(పిమ్మట బలరామ సాత్యకులు ప్రవేశింతురు.)

బల—పూజ్యులగు నందాదుల సందర్శింప బృందావనమున కేగి నేటికి నాల్గుదినములయి
నది. శ్యమంతకాన్వేషణంబునకై యేగిన తమ్ముండింకను రాకుండునా? వానిం జూడ
నానేత్రములు త్వరపడుచున్నవి. తమ్ముఁడా! సాత్యకీ! ముందుఁ గృష్ణునిరాక నా
రయుందము రమ్ము. (అని హజారపు ద్వారము ప్రవేశించి) తమ్ముఁడా! ఏమిది నేఁడు
నగరమంతయుఁ జిన్నవోయి చెన్నతఱిగి యున్నది. పరిజనుఁ డొక్కఁడును ద్వార
ముకడ లేకుండుటకుఁ గతమేమి? అదియుఁగాక,

సీ॥ వినఁబడదేమి యే ♦ వేళ సందడిమ్రోఁగు
వీణామృదంగ ని ♦ క్వాణపటిమ
కనఁబడదేమి కా ♦ న్కలఁబట్టి పడిపంచఁ
గాంచు సామంత భూ ♦ కాంత వితతి
అగడుపడదేమి ని ♦ త్యము హాజరము నిండు
స్వస్తివాచక విప్ర ♦ సముదయంబు
వఁవిరేమి త ♦ మ్ముల్కకు సోత్సాహులై
నాఁటాకఁదెలుప దౌ ♦ వారికులును

గీ॥ అనుజ! నేఁడేమిపూఁడెనో ♦ మానసఁగాంచి
పరిజనులు నించుచున్నారు ♦ బాష్పవారి
ఎచటఁగనుగొన్న శోకమా ♦ కృతివహించె
నల్లదే నగరుండె హా ♦ హారవంబు॥

సాత్య — అగ్రజా! ఏమో తెలియకున్నది? పూజ్యులైన దేవకీవసుదేవుల క్షేమమునకే మియుఁ గొఱంత లేదుకదా.

అక్రూ — బలరామసాత్యకులు వచ్చుచున్నారు. పరీదుర్వార్త యిదివరకే విన్నారు కాఁబోలు.

వసు — అయ్యో! అక్రూరుఁడా! వారిమొగము నేనెట్లు చూతును. హా! కృష్ణా!

బల — (ఆకర్ణించి) తమ్ముఁడా! సాత్యకీ? తండ్రిగారిమాటయే వినవచ్చుచున్నది. త్వరగఁ బోవుదముపద. (అని దేవకీవసుదేవులకడకుఁ బోవుచున్నారు.)

వసు-దేవకి-నాయనా! బలరామా! నీతమ్ముఁడు మాయమైపోయెనుగద. (అనిమూర్ఛిల్లును)

బల — అక్కటా! ఏమియీ దైన్యము. అక్రూరుఁడా! ఏమి సంభవించినది!

అక్రూ — నాయనలారా! మనకృష్ణుఁడు........అయ్యో! ఏమనిచెప్పుదును?

బల — ఏమీ! ఏమీ!

వసు — నాయనా! ఇంకేమున్నది?

మ॥ యదువంశాంకురమెవ్వఁ డెవ్వఁడు త్రిలో ♦ కానంద సంధాత దు
ర్మద కంసాద్యఖిలాసురాళి నళిపె ♦ న్మత్తేభమెవ్వాఁడు నా
హృదయాభీష్టమొసంగు నంగలవిప ♦ ద్విఘ్నుఁడు నా కృష్ణుఁడీ
ముదుసళ్ళన్ దిగనాడి యక్కటకటా! ♦ పోయెంగదా మాయమై

బల—ఏమిది యెక్కడకేగినాఁడు? ఎక్కడకేగినను వానికేమి భయము?

వసు—నాయనా! కంసమిత్రుండగు శంబరుఁడు నీతమ్మునివధించి మితృని ఋణము దీర్చుకొన్నాఁడఁట.

బల—ఎవరు చెప్పిరి?

అక్రూ—ఒకఋషీశ్వరుఁడు.

బల—ఎవ్వఁడా మాయలమారిఋషి?

వసు—ఎవ్వరో నేను పేరడుగ మఱచితిని.

బల—అయ్యో వెఱ్ఱితండ్రీ! ఎంతటి యమాయికప్రవృత్తి యిది. చిన్ననాఁటనుండి నీతనయుని బలపరాక్రమక్రీడలం గన్నారఁజూచుచుండినవారు మీరిట్టియసంభావ్యపువార్త విశ్వసించితిరెట్లు? బకశకటాదిరక్షోరాజులఁ బెక్కండ్ర నుక్కడంచిన యతిలోకవిక్రమక్రీడాధురంధరుండగు నీకొడుకును నొకశంబరుఁడు గాఁడీత్రిలోకము లొక్కపెట్టు నెత్తివచ్చినను నిర్జింపఁగలుగునే?

శా॥ రౌద్రిస్ఫూర్తి వహించెనా? ధరణిచ ♦ క్రంబెల్లఁ గ్రుల్లాడదే?
కద్రూజాతఫణాసహస్రములు వ్ర ♦ క్కల్లావె? యాశాతటీ
భద్రేభంబులు క్రుంగవే? హరిహయుఁ ♦ బ్రింగ్మల్ ప్రకంపింపరే
రుద్రాక్షుద్రిలలాటదృక్శిఖిశిఖా ♦ రోషంబు చల్లారదే॥

అట్టి నాసహోదరుండగు కృష్ణుని నొక నికృష్టపు రక్కసుఁడా వధించువాఁడు? ఇట్టి యవివేకంపువార్త మీరందఱెట్లు విశ్వసించితిరి? చూడుఁడు,

మ. భువనక్షోభము పుట్టలేదు ప్రళయరూ ♦ భోవాహముల్ భూరయస్ఫూ
ర్జితవహంబులు గురియింపలేదు భయక ♦ న్నిర్ఘాతసంఘాతముల్,
రవిచంద్రగ్రహతారకల్ జలజలన్ ♦ రాలంగలే, కూరకే
యవతారంబుదొరంగెఁ గృష్ణుఁడన నెయ్యా నమ్మ శక్యంబె తూనే.

సాత్య—తండ్రీ! ఈదుర్వార్త బొత్తుగా నమ్మఁదగినదికాదు. ఎవ్వఁడో క్షుద్రరాక్షసుం డొక్కఁడు మిమ్ము మోసగించినాఁడు.

రుక్మి—అత్తగారూ! ఈమాట నిజమైయుండును.

దేవకి—నాయనా! నిజమేకదా?

బల—తల్లీ ఏలదుఃఖించెదవు? నీకొడుకున కేకీడును లేదు. ఏట్టికీడు మూఁడినను దమ్ముని దెచ్చి నీయొడిం గూర్చుండఁబెట్టకున్న నే గురుజనంబుల పాదంబులపడం దప్పినవాఁడనగుదు. నేను బ్రతికియుండఁగా నాతమ్ముని నీడంద్రొక్కుటకునైన వేయ్యొక్కండ్రు శక్తుండగునే చూడు,

శా॥ చింతుర్ గంతుహరుర్, గృతాంతకుని శి ♦ క్షింతుర్, బలారాతిసా
ధింతుర్, లోకపతిర్ గలంతు, నమర ♦ ద్విట్కాండముంబట్టి బా
ధింతుర్, సాగరసప్తకంబు పరిశో ♦ ధింతుర్ భవచ్చిత్త మొ
ప్పింతుర్, జూడుమిదే జగత్త్రితయముర్ ♦ వేధించితేత్తుర్ హరిర్

అక్రూరుఁడా! మందా దొంగముని యెటుపోయెనో చెప్పుము?

అక్రూ—అయ్యా! ఇప్పుడే వాఁడీవంక నేగెను.

బల—తమ్ముఁడా! సాత్యకీ! రమ్ము ఆదుర్మార్గునిఁబట్టికొని చేయవలసినపనిచేయుదము

సాత్య—ఇదిగో ధనుర్బాణములతో నేను సిద్ధముగానే యున్నాను నడువుఁడు.

(అని యిరువురు పరువునఁ బోవుదురు)

వసు—అక్రూరుఁడా! బలరాముఁడు మిగుల తొందరవాఁడు. కోపతీవ్రమున నెవ్వరి నేమి చేయునోగదా?

అక్రూ—అయ్యా! ఎంతతొందరవాఁడైనను యుక్తాయుక్తములు విచారింపకపోఁడు. ఆతఁడనినట్లెవ్వఁడో రక్కసుఁడొనరించిన మోసకృత్యముగానే నాబుద్ధికిఁ బొడగట్టుచున్నది.

(పిమ్మట శంబరాసురుఁడు పరువెత్తుచుఁ బ్రవేశించుచున్నాఁడు.)

ఏటికో బలరామసాత్యకు లుద్రేకమున నాకెదురుగాఁ బరువెత్తుకొని వచ్చుచున్నారు. నేజేసిన మోసకృత్యము వారికిఁ దెలిసినదికాఁబోలు నేనిఁక వారికఁ టఁబడితినా నాపని సున్నయే. ఇందెందైన దాగియుందు (అని యొకమూల డాగుచుండ బలరామసాత్యకులు పరుగునఁ బ్రవేశింతురు)

శంబ—ఎవరయ్యా! మీరు? ఎక్కడ నెవ్వరితో సంబంధములేని యలౌకికపరివ్రాజకుల నిర్బంధించుచున్నారు.

సాత్య—ఆహా! ఏమి తపస్తేజము గాంభీర్యము మూర్తిభవించినట్లు.

బల—(అపహాస్యముతో)

క॥ తారుపరివ్రాజకుల
య్యా? రాచదివాణమునకు ♦ నరుదెంచినవా

శంబ—(స్వగతము) కీడ్రేకా? (నేనిప్పుడేమనను)వా రెవరో
పోరయ్యా మమ్ము నడ్డఁబోలదుమీకున్

బల—ఆహా! మహానుభావులుమీరు

శా॥ వ్యాసాదుల్ క్రమముఁబోలరీరెవరగ ♦ సత్యభాషితలా యేమి తా
మీనవ్యాసము నూనినందులకు నేఁ ♦ డే మీకునీవైహికం
బౌసంబంధములన్నియుండొలఁగు మో ♦ క్షావాప్తియా, బాడుగో
ల్వేసాల్వేయు నవస్థయుంగడచు ను ♦ ర్వీభారముల్ దూరవా॥

సాత్య—అగ్రజా! అక్రూరునిగూడ నునవెంటఁదీసికొనివచ్చిన బాగుండునుగదా. ఆతఁడు చూచినవాఁడు గాన దొంగనునినిగుర్తింపఁగలుగు.

(అంతట నక్రూర వసంతకులు ప్రవేశించుచున్నారు)

వసం—అక్రూరుఁడా! నీవు ముందుఁబరుగిడి బలరామ సాత్యకులఁ గలసికొనుము. నేనేండ్లుగడచిన ముసలివాఁడనగుటచే నీతోఁ బరువెత్తలేను. వయసునఁ గొంచెమెచ్చుతగ్గున కేమి సమానుఁడవైనను రాజుగారి సువారములోనుండు రాజబంధుఁడవాటచే శరీరదార్ఢ్యము నీకంతగాఁ దగ్గలేదు.

అక్రూ—వసంతకా! ఇప్పుడును హాస్యము లేనా?

వసం—నాబ్రతుకే హాస్యముకదా.

అక్రూ—(త్వరగఁబరువిడుచు) బలరామా! వాఁడే వాఁడే పోనీకుము.

(అనుచుఁ గలసికొనును)

బల—అక్రూరుఁడా! వీఁడేకదా యాదురాత్ముఁడు (అని వానినిఁగొట్టుచు) రేవంచకా!

క॥ ఇపుడేసునివాగితిరా
కపటపుసన్యాసినీవు ♦ గావా చెపుమా
నృపునకు వెగటుగనేదో
విపరీతము విరిచినట్టి ♦ వీఁడిదిసి ఖలా!

చెప్పము నిన్నింకవిడువను.

చ॥ వెడవెడనీచవృంబగటి ♦ వేసవుఁ బొండితి యెల్లఁజూపి నీ
కొడుకగతించెనంచటవ ♦ గూతలుగూసి నృపాలుచిత్తమా
అడియెుఱరించి తెవ్వఁడవు ♦ రా? అవురా! యిటువంటిమోసమా
నడునడుమింక రాజభవ ♦ నంబునకుల్ మెడిగోసివైచెదన్

(అని లాగుచుండ వాఁడు పెనగులాడును)

క॥ ఈనీలుగేలయింకం
బోనేర్తువె మమ్ముఁ గడచి ? ♦ బుద్ధిగలిగి మా
తేనికడ నిజము చెప్పవు
వా నినువిడు నడువు నడువ ♦ వా మెడఁ గోఁతుఁ

వసం—(కఱ్ఱతట్టుచు) అయ్యా! వానికిఁ దగినశాస్త్రి గావింప బ్రాహ్మణశూరుండనైన నేను వచ్చుచున్నాను. నీవు వానినిగట్టిగాఁ బట్టికొమ్ము (అనుచుఁ బ్రవేశించి వానినిఁ దనదండముతోఁ గొట్టుచు)

క॥ భడవా! యెంతకుఁ దెగితివి
నడిపగఁటనె కన్న పెట్టు ♦ నాలివిసినాన్న
పడవేసి కడుపు నలగ
మ్రుడికాయుంబోలెఁ గోసి ♦ మడపెదరమ్మా

(బలరామునితో) అయ్యా! ఈఋషీశ్వరులెవరో మీరెఱుంగరుకాఁబోలు

బల—వసంతకా! ఎవరేమి?

వసం—వీరు శంబరఋషీశ్వరులు

సాత్య—అనఁగా మాయాఋషులనియా ?

వసం—అయ్యో! మీకింకను దెలియదయ్యెనా ? మీరందఱు నన్ను మందబుద్ధియని నవ్వుచుందురుకా, నేనే యిప్పుడు కుశాగ్రబుద్ధినైతిని వీరు శంబరాసురఋషీశ్వరులు ఇప్పటికైనఁ దెలిసినదా ?

బల—ఎట్లూ! నేననుకొన్నట్లేయైనది. కంసమిత్రుఁడు శంబరుఁడా వీఁడు కంసునిపరివారములో జావక మిగిలినవాఁడా వీఁడు. వీనినింకనూరక పోనీయరాదురే! శంబరా! కదలుము నేఁటితో నీయుంకము ముగించు (అనిలాగికొనిపోవుచున్నాఁడు)

వసం—ఓరీ శంబరుఁడా! నీవార్త నేఁ డేమిబాగున్నదికాదురా కన్నములోఁ జిక్కిన పగఁటిదొంగవైతివి. ఓరి బానిసకొడుకా! యెన్ని వేషములు వేసితివిరా

గీ॥ కులికితివి సత్యభామవై ♦ తొలుతఁ బిదప
మోసపుంగతి మెండిన ♦ న్యాసివైతి
పాడుశతధన్వకయి ♦ పాకులాడి
గోఁతఁబడితి నేఁడు నీ ♦ కొంపమునిఁగె॥

ఆ! ఏమిరా మిట్టిమిట్టిమాచెదవు (బలరామునితో) ఆర్యా! వీనిని సడలువిడిచెదవు నుమీ బ్రాహ్మణహత్యచుట్టుకొనును నాకొల్లాయిగుడ్డనిచ్చెదను వీని రెక్కలువిఱిచి కట్టుము.

బల — ఇంక వీఁడెక్కడకుఁ బోవఁగలఁడు (అని నగరులోనికిఁ జేరుదురు)

వసు — నాయనా? వీఁడు నిజముగా దొంగయేకదా?

వసం — దొంగకాక దొరయా? యేమి వీఁడు కంసునిపరివారములోని శంబరుఁడు.

వసు — ఓరి దుర్మార్గుఁడా! శంబరుఁడా! యెంతపనిచేసితివిరా?

వసం — ఏగోచిపాతరాయఁడు వచ్చినను నెత్తిమీఁది దేవతయని మీరునమ్ముచుందురు అట్టివారే కొంపలార్పువారు అగస్త్యుఁడొకరెత్తు ఆయనకమండలువు నొకరెత్తు అనునట్లు వీఁడొకరెత్తు వీనిగడ్డమొకరెత్తు చూడుఁడు బావురుపిల్లివలె నెట్లుజూచుచున్నాఁడో. మనకృష్ణునకుఁ బ్రతికక్షియై వీఁడెంత లేసి సాహసములుచేయుచుండెనో మీరెఱుఁగరు ఇప్పుడేమి మనకృష్ణుఁడురానీ వీనిభరతముపట్టింతును.

కంచుకి — (ప్రవేశించి) ఆర్యా! మనచిరంజీవి కృష్ణుఁడిదేవచ్చుచున్నాఁడు.

వసుదేవాదులు — ఎక్కడెక్కడ

(అంతట రథారూఢుఁడై సాత్రాజితితోడను నొకసూలఁ బెడరెక్కలు విఱిచికట్టఁబడిన శతధన్వితోడను కృష్ణుఁడు ప్రవేశించుచు)

ఉ॥ ప్రాకటధర్మసంచరణ ♦ పౌరవరుల్గనుఁగొండు రండు వీఁ
డేకులపాంసనుండునుగ ♦ రీహరుఁడునో శతధన్వవీనిపై
నీ కులకన్యఁబలిమి ♦ చేఁ జెఱఁబట్టుటకూడదంచు నం
బూకృతమాచరింపుఁడన ♦ పుంగన మీరునుమీరుమీరును॥

వసు — (ఇంతలో వసుదేవాదు లెదురువచ్చి) కృష్ణా ఎన్నాళ్లకు మాకంటబడితివితండ్రి

కృష్ణ — జననీజనకులారా! అభివాదనము అగ్రజా! నమస్కారము.

దేవకీ — వసు-బల-చిరాయుష్మంతుఁడవై యుండుము

దేవ — అబ్బాయి, ఈయమ్మాయి మనసత్రాజిత్తుబిడ్డగదా అమ్మా ఇటురా రథము నెమ్మదిగా దిగుము.

కృష్ణ — అమ్మా! పాపమీకన్యంబలిమిమై బట్టిరథంబునఁబెట్టికొని దురాత్ముఁడగు నీశతధన్వుఁడుపోవుచుండఁగా నే నెదురుపడి వీనినీరథంబునఁగట్టి యిక్కడకుఁ దెచ్చితిని.

రుక్మి — నాథా! అభివందనము.

కృష్ణ—దేవీ ! కుశలమా

రుక్మి—నాథు (నీ)యనుగ్రహమున్నఁ గుశలమునకేమి ?

దేవ—ఎంతటిమర్యాదస్థుఁడు వీడు

రుక్మి—(స్వ) ఈబిడ్డకేకదా నాథుఁడు మణినన్వేషింపఁ బోయినది. చెల్లెలా! అగ్నిప్రవేశమున మృత్యుముఖమునుండిమాడిపడితివి. సౌభాగ్యవతివికమ్ము.

వసు—దేవిగారనుగ్రహించినలోపమేమి?

రుక్మి—(స్వగతము) ఈబ్రహ్మచారి తనవక్రతమాపించుచున్నాఁడు.

కృష్ణ—తండ్రీ! సత్రాజిత్తునకీవార్త దెలియఁబంపుఁడు ఆతఁడు నాపై వేసిననిందకై యాతని శ్యమంతకపుజాడనెఱింగి తెచ్చితి ఇందఱిలో నాతనికి మణియిచ్చెదఁగాక (ఇంతలో సత్రాజిత్తు ఆతురతతోఁ బ్రవేశించి) ఆయ్యా ! వసుదేవా! మీకృష్ణుఁడెక్కడ?

వసు—కన్నులువిప్పిచూడుము అతఁడేకృష్ణుఁడు. ఈవనమునకృష్ణవేషగాండ్రు బయలుదేఱుటచే మోసపోయి నిజమైనకృష్ణుఁడెవరైనది తెలిసికోలేకున్నాఁడవు కాఁబోలు.

సత్రా—కృష్ణా! నాకూఁతుమాయావియైన శతధన్వుఁడెత్తికొనిపోయినాఁడట వాఁడు నీకంటఁబడలేదా?

వసు—వాఁడు మాయావియగుట యిప్పుడు తెలిసినదికాఁబోలు తొలుతనుమ్మ నిగ్రహించునప్పుడు వాఁడే పరమబంధుఁడు. ఏదైనను నెత్తికిఁ జేతులువచ్చినప్పుడుగాని తెలియదు.

కృష్ణ—అయ్యా! వాఁడు నాకంటఁబడెను. అతఁడేశతధన్వుఁడు పట్టితెచ్చితిని. అదిగో నీతనయ. ఇదిగో నీశ్యమంతకమాణిక్యము.

సత్రా—(శతధన్వుతో)ఓరీ బంధుద్రోహి! ఎంతసాహసము చేసితివిరా అమ్మాసత్యా! ఈదుర్మార్గునివలన నెంతపంభవము నొందితివేతల్లీ.

కృష్ణ—సత్రాజిత్తూ! నాఁడునిర్హేతుకముగనన్ను నిందించితివిగాని నిజమారయనైతివి. ఇఁకజరిగిన వృత్తాంతమాకర్ణింపుము.

క॥ అడవికిఁజనిన ప్రసేనున్
గడపిమణిఁగొనియె హరియొకండద్దాన్
గెడపికొనె జాంబవంతుఁడు
కడకతనినెటోజయించి కంటిన్నీకై॥

సత్రా—కృష్ణా! నేనపరాధిని. ఎఱుకలేనికతమున నిన్నెంతయో తూలనాడితి నానేరము క్షమింపఁబడుఁగాక.

శా॥ క్రూరక్లేశకిఁజిక్కి దిక్కుసెడియుం ♦ గ్రోధించు నాకూర్మిక
న్యారత్నంబును బంధులం, గలిపిపాపా ♦ యాసముం బాపి, మున్
జోరగ్రస్తమునాశ్యమంతకమణిన్ ♦ శోధించిసాధించితీ
కారుణ్యంబున నేమిప్రత్యుపకృతిన్ ♦ గావింపఁగాఁజాలుదున్॥

కృష్ణా! నేఁడునిన్నెంతగానిందించినను నాకింతటియుపకారమొనర్చిననిన్ను నే నెంతనికొనియాడుదు. ఆహా యిదికదా మహోపకారిలక్షణము.

చ॥ ఇలనపకారికేనియిర ♦ పేక్షితులై యుపకారమేతగన్
సలుపుదురుత్తముల్ ♦ సుగుణశాంతసమగ్రులనుగ్రహంబునన్
అలసుమనోగణంబిను మ ♦ దాళికిఁదాడనకోర్చి తేనెపూ
రసఫలమిచ్చుచున్ ఘనత ♦ రుల్ తమకొమ్మలఁగొట్టువానికేన్॥

కృష్ణా! ఇంక గతంబెల్లమఱచి నావేఁడికోలంగీకరింపుము.

చ॥ ఎఱుఁగక దుష్టబోధనల ♦ కే చెవియొగ్గి మహాపరాధముల్
జఱపిన నాయవజ్ఞతకు సై ♦ చి, దయామతి బంధుభావముల్
నెఱపుము నీగణించిన మ ♦ ణిందన యామణియుంగ్రహింపుమం
దఱుఁదలఁయింపు నాకులము ♦ ధన్యతమంబొనరింపు మాధవా!

కృష్ణు—అయ్యా! ఇందునాచేసిన మహోపకారమేమున్నది. నేనీమణిని సాధించి తెచ్చినది నానిందఁ బాపికొనుటకుఁగాని నీయుపకారార్థమైకాదు కావున నీమణిని నీవ యుంచికొనుము. (మణినిచ్చుచున్నాఁడు)

సత్రా—అలాగైన నా కుమారీమణిం బరిగ్రహింపక తప్పదు. వసుదేవా! మనము సంబంధముకలిపికొనుట లెస్సగదా.

వసు—నాయనా! కృష్ణా! ఈతఁడు మనసంబంధమునకెంతయు ననుకూలుఁడు. నీవింక నీసత్రాజిత్తుప్రార్థన మంగీకరించి యాతనికన్యంబరిగ్రహించి యనుగ్రహింపుము.

వసుం— ఈవిషయమె దేవిగారనుగ్రహింపవలయు.

రుక్మి—[స్వగతము] ఏమి యీబ్రహ్మచారి యెంతసిగ్గుమాలినవాఁడు. [సత్రాజితిచేయి పట్టుకొని] చెల్లెలా! నావలెనే నీవును నీరసాలవృక్షమల్లికొనుము సర్వజగద్భరణాడైన యీమహానుభావుఁడు మనకిర్వురకు నాశ్రయుఁడు కాఁజాలఁడా!

(అని కృష్ణునిచేయితోఁ గలుపును)

గీ॥ మసృణమకరందరసమిది మావిమోక
నేఁడు తల్లీనమైచ్ఛాయామనుక్షణిని
అల్లిక్రొను మీఁదు నిటజాతివల్లి వగచు
భువనముల నద్యశస్సుమ బుచెలఁగ॥

వసం — దేవీ! ఈమావిమోఁకకును నీజాతిలతకును నీవే చక్కని దోహదమిచ్చి కాపాడవలయును.

రుక్మి — తోఁటమాలివి నీవున్నావుకదా.

వసం — సద్బ్రాహ్మణుఁడనైన నాకు తోఁటమాలి పనియేఁదుకు. నేనిప్పుడు స్వస్తివాచకుండనయ్యెదను. "దేవీం వాచమజనయంతి దేవాః" అని చెప్పుచు సంధ్యావందనము నెఱుఁగకున్నను నీలాంటి స్వస్తివచనంబులతో నేను వసిష్ఠుఁడనైతిని.

వసు — నాయనా కృష్ణా! ఇంక నీదుష్టుల యథార్హముగా శిక్షించి భూభారము కొంత తగ్గింపుము.

శత — (చేతులుజోడించి) కృష్ణా నేనపరాధిని దుర్మోహమున నింత చేసితి నన్నింక నీవేమి యొనర్చినను సంతసమున భరింతుఁగాక (నమస్కరించును)

శంబ — ఆర్యా! ఈతనివలనే నేనుఁ జెడితి నాయపరాధము క్షమింతురుగాక నేనిదే నీశరణము వేఁడుచున్నాను. శ్రీరాముఁడు విభీషణునివలె నన్ను నీవు రక్షింపవలయును (నమస్కరించును)

కృ — తండ్రీ! శరణాగతులైన వీరిందండించుటపాడిగాదు ఓరీ శంబరా! ఓరీ శతధన్వా! ఇంతటనైన నాబుద్ధిని మంచిమార్గమున వర్తింపుఁడు.

శా॥ దేవబ్రాహ్మణగోతపస్విజనుల ♦ నార్తింగూర్పకుండన్యకాం
తావారంబులఁదల్లులంగనెదు ♦ కంటఁజూడుఁడస్తోకవి
ద్యావైశద్యమునన్మెలంగుఁడు ♦ సురవ్యాసంగముల్మానుఁడీ
లైవర్తింపరగాని వేఱెబ్బెదము ♦ దీయక్రూరచక్రాగ్నులన్

శంబర శతధన్వులు — దేవా అట్లే వర్తించెదము.

కృ — అక్రూరుఁడా! ఈశతధన్వనిం బంధముక్తిగావించి పంపివేయుము.

(అక్రూరుఁడట్లు చేయుచున్నాఁడు)

శంబర శతధన్వులు — నమస్కరించి (నిష్క్రమింతురు)

వసు—కృష్ణా! మనమందరము కృతార్థులమైతిమి. శుభములన్నియు సమకూరె నింకేమి కొఱంత?

కృ—మీయాశీర్వాదబలమున నన్నియు సమకూడె మరియు నిట్లగుఁగాక.

గీ॥ సరసనస్వార్థ్యమై వసుం ♦ ధర రహించు
అవనిపుల కెచ్చుఁగాక పరి ♦ జానురక్తి
ఆర్యధర్మంబు లెల్లెడ ♦ వలరుగాక
జయముఁగొనుఁగాక సత్కవీ ♦ శ్వరుల కృతులు॥

వసుదేవ బలరామాదులు—తథాస్తు తథాస్తు.

(అంతట నందఱు నిష్క్రమింతురు)

సంపూర్ణము.

నాటకములు **పువ్వులు.** నవలలు

రకరకముల పువ్వులు.        రంగురంగుల పువ్వులు.

మీ కేపువ్వులిష్టమైన నాపువ్వులన్నియు మాయొద్ద నున్నవి. కన్నులు చెదరెడు కారుమంకెన్న పువ్వులరాణీపరువంపు రోజా, పరిమళంబునుగురియు పండుగేదంగి, వలపులు చిలికెడు వాసంతమల్లి, వంధ్యలవిప్పారుసౌరుసంపంగి, కులుకులంబాదలెడు క్రొమరుగోరింట - ఇదియదియననేల, అన్నివిధములగుపువ్వులు కలవు. ఈపువ్వుపాత్రములలోని చిత్రమేమన, నాయాపువ్వులే యాయాకథలకుం గారణభూతములగుచుండును. కల్పనాప్రపంచమున నిదిక్రొత్తతోవ. ఈపువ్వులు పరిమళమునేగాక విజ్ఞానపరిమళమునుగూడ చిలుకుచుండును. ప్రతిపువ్వును, ఒక్కొక్కచిన్నినవల. ప్రతినవలయు ముప్పదిపుటలు తక్కువగాకుండ నేబదిపుటలకుమించకుండ నుండును. ఒక్కొక్కపువ్వువెల చందాదారులగువారలకు 0-4-0లు రెండుమాసములకొకసారి రెండుపాత్రములను పోస్టేజిమేమేభరించి రు. 0—8—0 లకు వి. పి. గా బంపుచుందుము. ఇతరులకొక్కొక్కపువ్వువెల పోస్టేజిగాక రు. 0—6—లు. అప్పుడప్పుడు నవీనపద్ధతిని వ్రాయఁబడిన పౌరాణికములు, చారిత్రికములు, అపరాధరహస్యపరిశోధకములును నగు నవలలునాటకములు కూడ వీలువెంబడిని పంపుచుందుము.

N. B. మేము ప్రకటించు పూవుపాత్రములును, నాటకములును, నవలలును, మాశాశ్వతచందాదారులు తప్పకపుచ్చుకొనవలెను. ప్రవేశరుసుములేదు. దరఖాస్తుతో నివాసస్థలము, పోస్టాఫీసు, జిల్లా వివరముగవ్రాసిపంపవలెను. నివాసస్థలముమారినప్పుడెల్ల మాకు తెలియఁజేయుచుండవలెను.

వలయువారు,
శాస్త్రీ అండు కంపెనీ,
భారతీయగ్రంథకుసుమావళిప్రకాశకులు, రాజమండ్రి.

# సుప్రసిద్ధనాటకములు

1. సత్యహరిశ్చంద్రీయము — బలిజేపల్లి లక్ష్మీకాంతకవి విరచితము. సర్వజనములచే కొనియాడఁబడుచు పెక్కునాటకసమాజములవారిచే ప్రదర్శింపఁబడిన నాటకరాజము. ప్రతిపద్యము మనోహరమై, ద్రాక్షాపాకమున నొప్పుచు ఏరసము వచ్చినప్పుడు ఆరసమును వెదజల్లుచుండును. ఇప్పటి హరిశ్చంద్రములన్నిటిలో నిదియే పేరుగాంచినది. ఔచిత్యమునకు పెట్టినపేరు. వెల రు. 1—0—0 గ్లేజు కాగితముల ప్రతి రు. 1—4—0

2. చిత్రమానవనాటకము — వంటు సుబ్బావధానికవి విరచితము. కథావస్తు నిర్మాణమునందు ఇట్టినాటకము తెలుఁగులో కనుపించదు. సమానరూపనామములుగల ఇద్దరుపురుషులు, వారిసేవకులు, వీరినిగురించి ఇతరులుపడినపాటుపాట్లు మనోహరముగా సర్వరసపూరితముగా వర్ణింపఁబడినవి. నాటకము చదివినఁగాని ప్రాశస్త్యము తెలియదు. మంచికాగితములు వెల 0—12—0

3. తెలుగు ప్రాక్టికల్ జామిట్రీ — డైరెక్టరుగారిచే అనుమోదింపఁబడినది. కొన్ని పాఠశాలలలో నుపయోగింపఁబడుచున్నది. వెల 0—5—0

4. భజగోవిందశ్లోకములు — మూలమునకు సరియైన పద్యములు. (అచ్చులో నున్నవి.) వెల 0—2—0

వలయువారు,

భాగవతుల సుబ్బయ్య, కొత్తపేట, తెనాలి.

అనివార్యవలయును.